# మా స్వంత ప్రచురణములు

## నాటకరాజములు

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణశాస్త్రిగారి

| | | |
|---|---|---|
| రసపుత్రవిజయము | ... | 1—2—0 |
| రాణాప్రతాపసింగ్ | ... | 1—0—0 |

డాక్టరు నండూరి శివరావుగారి

| | | |
|---|---|---|
| చంద్రగుప్త | ... | 1—4—0 |

పానుగంటి లక్ష్మినరసింహారావుగారి

| | | |
|---|---|---|
| పాదుకాపట్టాభిషేకము | ... | 2—0—0 |
| విప్రనారాయణ | ... | 1—8—0 |
| రాధాకృష్ణ | ... | 0—12—0 |

ముత్తనేని వేంకటచన్న కేశవులుగారి

| | | |
|---|---|---|
| చండిక | ... | 1—8—0 |

సూరి పార్థసారథిశర్మ

| | | |
|---|---|---|
| రంగూన్ మెయిల్ | ... | 1—4—0 |

---

వలయువారిల్లు వ్రాయవలయును :

కొండుభొట్ల సుబ్బారావు సన్

ప్రొప్రయిటరు;

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ

# సేవ



(సాంఘిక నాటకము)

చింతామణీ చిత్రాభ్యుదయాది గ్రంథకర్త

మహాకవి


కాళ్ళకూరి నారాయణరావు

ప్రణీతము.



ప్రకటనకర్త

కురుకూరి సుబ్బారావు

ప్రొప్రయిటరు సరస్వతీ బుక్ డిపో

బెజవాడ (కృష్ణా)

అయిదవ కూర్పు : 500 ప్రతులు

బెజవాడ:

శ్రీ సరస్వతీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము

1947


 Reprint. [వెల రు 1-8-0.

# ఇందలి పాత్రములు

1 రఘు– రఘునాథరావుగారు – కథానాయకుడు
2 విశ్వా– విశ్వాసరావు – రఘునాథరావుగారి మేనేజరు
3 శర్మ–రఘునాథరావుగారి దుష్టస్నేహితుడు
4 నిర్మ– నిర్మల – రఘునాథరావుగారి భార్య
5 కస్తూ– కస్తూరి – వేశ్య
6 చిన్న – సిపాయి చిన్నయ్య – రఘునాథరావుగారి నవుకరు
7 రంగ – రంగఁడు. ఒక త్రాగుబోతు
8 వెంక– వేంకటేశము – కస్తూరి తమ్ముడు
9 కాసిం– కాసింసాహెబు – కస్తూరి రహస్య విటుఁడు
10 ఇన – ఇనస్పెక్టరు
11 మేజి – మేజిస్ట్రేటు
12 ప్రాసి – ప్రాసిక్యూటరు
13 పంతు – పంతులు – రఘునాథరావుగారి వకీలు
14 నాయు – నాయుడు – కస్తూరీ శర్మల బారిష్టరు.

---

ఓం




# ప్రథమాంకము

ప్రవేశము : రఘునాథరావుగారి మేడమీఁది కచేరిచావడి

(ప్రవేశము : రఘునాథరావుగారు పడకకుర్చీమీఁద కూర్చుండి పత్రిక చదువుచుందురు.)

రఘు - (చదువు నిలిపి, యొక్కనిట్టూర్పు విడిచి) నేఁటి పత్రికలయందుఁ

బరిస్థితు లన్నియు బహు భయంకరములుగా నున్నవి!

చ. కఱ వొకవంక! జాతి మతకక్ష ప్రకోప మొకవంక! హత్యలున్
మరణము లొక్కవంక! దయమాలిన ధర్మనిరుద్ధ చర్యలున్
జెఱ లొకవంక! నోటికిని చేతికిఁ గట్టులు లొక్కవంక! ఇ
త్తెఱఁగున దేశ మెల్ల నతిదీనదశావశ మయ్యె నే మనన్!

చ. తలఁకని స్వేచ్ఛతోఁ, బటువు తప్పి యొసంగని పౌరుషంబుతో,
నెలకొను శాంతితో, దిశలు నిండిన కీర్తితో, సమృద్ధితోఁ
దొలఁగని భోగభాగ్యములతోఁ దులదూఁగిన దేశ మిప్పుడి
ట్టులు తలక్రిందులై, కుడిచెడు నిష్కృతిలేని విపత్పరంపరన్!

(క్షణ మూరకుండి) మన దేశమున కెన్నఁడైన మరల నట్టి యోగము పట్టునా!....ఎక్కడి యోగము....ఎక్కడి భోగము!

సీ. కొంపలు తెగనమ్మి కోర్టుల, హైకోర్ట్లఁ గా
ఫీ హోటళ్ళ, వకీళ్ళఁ బెంచువారు
పండిన సరకెల్లఁ బరదేశముల కంపి
కడుపున కిర వేఱుపఱుచువారు
మూఁడు ప్రొద్దుల ముష్టి మూన్సిపల్ మెంబరు
పదవిలోఁ గనులు కన్పడనివారు

ఆస్తి భార్యలపేర అప్పులు తమపేరఁ
బెంచి, ఐ. పీ. లకు బెట్టువారు
బట్టకొంటకుఁ, బుట్టుకొంటకు, ద్రాందికొంటకు
సిరులు పరదేశములపాలు సేయువారుఁ
బూర్తిగా నెల్లెడల వట్టిపోవునుక
దేశమున కీ యరిష్టము తీఱఁ బోదు !

(ఉలికిపడి) ఏమిచెప్పుమా యీ గోల ! (అని లేచి గవాక్షము గుండ వీధివంకఁ జూచి) ఎవనినో తప్ప త్రాగిన జాగ్యానికాని వండ భటులు, చచ్చిన గేదెమూడనుబలెఁ జరచర నీడ్చుకొని పోవుచుంట సోమరులు కొందరు చోద్యముక్రిందఁ జూచుచు నాసని వెంబ డించినారు ! సిగముడి వీడ, సింగారించిన వుట్ట మూడ, బక్షునఁ బడ్డ చేపవలె, ఓడ దిగిన నావికునివలె, తేపతేపకుఁ దొంతెక్కు లాడుచు, అనువు తప్పిన యవయవములతో, అలుకుపాటు లైన యుడుపులతో, పెంట లూడ్చిన తలతో, పెచ్చు లూడిన మొసలితో మద్యపానమువల్ల నీ మందభాగ్యుఁ డేమి యానంద మనుభవించు చున్నాఁడో !

చ. జలములు గ్రోలి కుంజరము సత్వసమృద్ధి మెలంగ నేర్చు, నా
జలములె త్రావి సింహ మతిశౌర్యబలప్రతిభాస్థితి న్మదా
వళ ఘన కుంభయుగ్మమును బ్రద్దలు సేయును; వీని నాత్మలోఁ
దలఁపక, మానవుండు సురఁ ద్రావఁగఁ గోరు నిదేమి వెఱ్ఱియో !

చిన్నయ్య—(ప్రవేశించి) బాబూ ! రంగఁ డీపూట కొంచెం సమ్మునీళ్లు బద్దకించి, పెళ్ళాన్ని కొట్టబోతే, ఆ గబ్బ, అడ్డఁవెళ్ళిన అత్తగారికి తగిలిందంటండి, అందుకోసము పోలీసునా రామొదనను చేశను కీడ్చుకుపోతున్నారంటుండి. దేల్ని వారితో యీసంగతి చెప్పమని ఆడిపెళ్లాం వొచ్చి అగోరిస్తాందండి.

రఘు—ఏమీ, యిప్పుడు పోలీసువారిచే నీడ్చుకొని పోఁబడుచున్న వాఁడు రంగఁడా ! ఇటువంటి విషయములో మానవుకర్లకు మేము సాయపడువారము కామని చెప్పుము !

చిన్న—చిత్తం బాబూ! చిత్తం. ఇదే మా పటాలంలో అయితే యీపాటికి చీకటికొట్లో వేశారన్నమాటే. తెల్లోడు తాను తాగడంవేకాని, యెదటివాడు తాగడాని కెన్నడూవొప్పుకోడు.

రఘు—సరే, నీసోదె చాలుఁ గాని, వీలుగా నున్నయెడల నొకసారి పయికి రమ్మన్నా నని విశ్వాసరావుగారితోఁ జెప్పి క్రొత్తగుఱ్ఱమునకు జీనుగట్టి కొనితెమ్మని గుఱ్ఱపువానికి వర్తమానమంపుము.

చిన్న — చిత్తం బాబూ! చిత్తం (అని నిష్క్రమించును.)

విశ్వా—(ప్రవేశించును)

రఘు—మామగారూ ! రంగని సంగతి విన్నారా?

విశ్వా—విన్నాను బాబూ! విన్నాను.

రఘు—తోడనే వీనిని కొలువునుండి తొలఁగించుట మంచిది కాదా?

విశ్వా—మంచిదే కాని, యొకసారి మందలించి చూతము.

రఘు—ఏమి వెఱ్ఱి! గుగ్గిళ్లు పెట్టిన గూనివంపు తీఱునా?

ఆ. పూదిబుంగ నరుఁడు దుర్వ్యసనంబులు
నిప్పులు లేని చింత నిప్పు రవలు
స్పర్శమునకు దాకి సంఘటిల్లిన నంతు
చూడకుండ వీడనాడు ఱేడ!

ఆపయిని —

గీ. అంటురోగంబులకును, దుర్వ్యసనములకు
లేదు పరికింప భేదము లేశమేని;
దరికి రానిస్తు మేని, తథ్యముగ ప్లేగు
పోలిక, క్షణంబులోఁ జుట్టుముట్టు[illegible]!

విశ్వా—నిజమే నిజమే. కావుననే దుర్వ్యసనపరులకును [illegible] దూర మెంతయున్న నంతమంచి దని పెద్దలు చెప్పుదురు. వాని సెలవుసరికాగ మీరంగని తత్‌క్షణమే తొలగించెదను.

రఘు—(నవ్వుచు) సరి కాని, మామగారు! సాహసించి యడుగుచున్నాను. మీ కేమియు దుర్వ్యసనములు లేవు కదా?

విశ్వా—ఈశ్వరానుగ్రహమువల్ల నింతవఱకు లేవు!

రఘు—ఆఁ! మామగా రిప్పుడు నా చేతిలో మత్స్యము గాలమునఁ
జిక్కినట్లు చిక్కినారు ! మీకు నస్యవ్యసనము లేదా?

సీ. నస్యంబు దృష్టిని నాశంబు గావించు
పొగచుట్ట పెదవుల పొలుపుఁ జెఱచు
బీడీలు జిహ్వా కప్రియ మాచరించు
సిగరెట్టు గుండెను శిథిలపఱచు
మద్దతు బుద్ధికి మాంద్యంబు కలిగించు
గంజాయి పిచ్చిని గలుగఁ జేయు
కాఫీ నరంబుల కాపత్తుఁ గలిగించు
టీ పైత్యవృష్టి ఘటిల్లఁ జేయు
మానుము వివేక మెల్లను మంటఁ గలుపు
భంగు జ్ఞాపకశక్తిని భంగపఱచు
అభిని రక్తమాంసంబుల నార్చివేయుఁ
గాంచ దుర్వ్యసనంబులు కావె యివ్వి?

విశ్వా—నస్య మంతకూడని దని నా కెన్నఁడుఁ దోఁచలేదు.
రఘు—ఆలాగుననా! అట్లయిన నాలకింపుము...

సీ. ఎంతటివానిచే నేమియు బిడియంబు
వెడలించి, చేయి చాపించిపోవు !

విశ్వా—ఆమాట నిజమే. వెలమదొరగారు కూడ పొడుమునకు చెయ్యి
వెనుతీయరు !
రఘు—తఱచుగా నేడనో దాఁకొని పెట్టె నిల
త్రించి తైతక్క లాడించిపోవు !
విశ్వా—ఏడనో కాదు, ఎదుటను నుండియే కంటికి కనఁబడదు !
రఘు—ముందుగాఁ దన్మాత్రి మూర్కొనకున్నఁ, జే
యంగఁబూను పని కన్ను తగిలిపోవు !
విశ్వా—నందియ మేమి, భోజనసమయమునఁ గూడ పొడుము పీల్చినఁ
గాని కథ నడువనివారు కానఁబడినంతమంది !

రఘు—సుఖ్కను సుజుగు సూనుగఁ జేసి, దేవుని
తిన్నపైనె న్రీదించిరీలు!

విశ్వా—దేవుని తిన్న మీఁదనే కాదు—దేవునితలపైగూడ నాయూ
ఉత్తో పప్పుడప్పుడ భిషేకము జరుగుచునే యుండును!

రఘు—ీటసురకలతో మేని యుకుపులెల్ల
ఛించి—చాకలిచేత దిట్టించిరీలు!

విశ్వా—చాకలి చేతనేగాదు — చాకిలి యూమ్ఛ దాసీదానిచేఁగూడ
చావృతిట్లు తినవలసిన దే!

రఘు—పలుపలుకు లేల—వెలయాలుపగిది — నెత్తి
నెక్కి, కట్టి కుండల చేతి కిచ్చిరీలు!

విశ్వా—నిజమే బాబూ!—నిజమే! ఇదిగో— నాపాదముబుట్టి నిప్పుడె
పప్రాకిరింద కొట్టెద! (అని యట్లు చేయును).

రఘు—సెబాసు! నాజన్మ మిపుడు చరితార్థమైనది! ఏమూ?
ఏటనాలుగఁ బాటుడి యేటినుండి
నర్తెమువలె నల్లు లేలమించు ఋణమునుండి
నాటుకొనినట్టి దుర్వ్యసనములనుండి.
యొకనిఁ గాపాడినను జన్మ మొప్పు నందుర్.

చిన్న—(ప్రవేశించి) బాబూ, గుఱ్ఱ మొచ్చింపండి.

రఘు—మామగారు! నే నొకసారి మనతోటవఱకుఁ బోయి వచ్చెద.
ఈపూట వచ్చిన యుత్తరములివిగో, యిచ్చట నున్నవి (అని
బల్లమీఁది యుత్తరములుచూపి, బట్టలు వేసికొనిచిన్నయ్యతో
నిష్క్రమించును.)

విశ్వా—(ఉత్తరములం దీసికొనుచు) అవురా! అబ్బాయిగారి యో
గ్యత! ప్రభువు లందఱు నిట్టి వారైనచోఁ బ్రజల భాగ్య
మెట్లుండెడిదో గదా!

సీ. కోళ్లతో, గొఱ్ఱెపొట్టేళ్లతో, సీమ కుం
దేళ్లతోఁ గొలువులు దీఱువారు!

వేలును లక్షలు వెచ్చించి, కుక్కలకుఁ
గాని మూతి నాకించుకొనెడివారు!
ఇంటిదాసీలకు బంటులై, భార్యల
మోము లన్న మొగాలు ముడుచువారు!
పాడువేసాలకై బ్రాంది సీసాలకై
యెస్టేట్లనే విక్రయించువారు!
నై, జమీందారు లెందఱో నైజకీర్తి
గంగలోఁ గల్పుచున్న యికాలమందు---
భాగ్యవశమునఁగాక, యిట్టిది పరమ
పావనుండైన ప్రభువు సంప్రాప్త మగునె!

చిన్న—(నడిగాఁ బ్రవేశించి) అయ్యో! అయ్యో! రండి!-రండి!-రండి!
పాడుగుఱ్ఱం బెదరి బాబుగార్ని పడదోసిందండి!

పిచ్చా—(ఉలికిపడి) అరెరే! యెంతపని జరిగినది! అబ్బాయిగారి కేమియు దెబ్బ తగుల లేదు గద?

చిన్న—అమ్మయ్యో! అంతగుఱ్ఱంమీదనుంచి పడితే దెబ్బే తగల్దా? తల పగిలిందంట, తరువేసి ఆసుపత్రికి తీసుకు పోతున్నారంట! పోలీసువారు జామీను తీసుక పొమ్మంటే, అనఁవయానికి రంగ జెల్లాగో ఆదారి నొస్తున్నాడంట, పాపం. బాబుగార్ని వాడే పట్టి లేవనెత్తాడంట!

పిచ్చా—(ఆందోళనముతో! అన్నన్నా! యెంత ప్రమాద మెంత ప్రమాదము! దైవమా! నీవింత దారుణమున కొడిగట్టితి వేమి!

ఆ. సకలసుగుణరాశి, శాంతి పయోరాశి
వినయ భరితుఁ, డతివివేకకలితుఁ;
డట్టివాని కిట్టి యాపద కలిగింప
బుద్ధి యెట్లు నీకుఁబుట్టె నయ్యొ!

(అనుచు సత్వరముగా నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.




# ద్వితీయాంకము

## మొదటి రంగము

ప్రదేశము : రాజవీథి

రంగడు —(గొడుగు చేతఁ బట్టుకొని ప్రవేశించి)

పాట

(1) సారా కల్లూ సల్లగ వుంటే - రొక్కం సొబ్బులు కొంటినివుంటే
లోకుల్లో నా కేమి పని!, యీలోకంతో నా కేవి పని!
(2) కాలవ లన్నీ కల్లే అయితే - సంవుద్రి వంతా సారా అయితే
కలిపోస్తె నా కేంవి బయం! కాటకం వొస్తే యేంవి బయం!
(3) సారా సీసా సంక నుండగా, సేతను సుప్పెట సీస లుండగా
హాయిగ పెణం పోవాలి, అప్పుడు సొర్గం రావాలి!

సందేయం వేంవీ? సారా తాగినోడో సరసుడు; కల్లు తాగినోడే ఘనుడు. కాదన్నవాడు నా కాలిగోరుమీదనుంచి బలాదూరు! అయితే, వోటిమాత్తరం నిజం: తాగేవాళ్ళ అదురుష్టం వంతా తాటిసారాతోటేపోయింది అంటున్నా సిగురు సారా పోవడం, సిరి పోవడంవే! ఆమాంవిడిసిగురు రంగూ—ఆ సకల సంపెంగ వాసనా, ఆ అగ్గినిప్పు నిషా, వో! వో! గ్యాపకం వొస్తే, వొళ్ళు గరిపొడుస్తుంది! పాడు రమ్ముల్, ఈ రమ్మొచ్చి, నొమ్ములు తినేస్తోంది! అయిదుబుడ్లు తాగినా, అగ్గిపుల్ల మంటలాగ, అంతలో సల్లు! సాట్లోళ్ళు తాళ్ళకు నెంబర్లెయ్యడం వొచ్చాక, కల్లుకూడా కంగాళీ అయిపోయింది. కల్లు తాగితే

మునుపు, కవిలాసంలో వున్నట్టుండేది! ఇప్పుడు కల్లు తాగితే కళ్ళు తిరగడం, వొళ్ళు పెరగడం, పళ్ళు విరగడం తప్ప, పైనేమీ లేదు! కల్లు సంవృద్ధిం యెక్కడుందో కనపర్చిందాకా, బేప నోళ్లను పట్టుకొని, బేపుల్నాకే గుతస్తే బేసుగ్గా వుండేది! (పరిక్రమించి) నేను రంగంవెళ్ళి, ముసుపులమ్మ తీర్థానికి మూడేళ్ళు ఈమూడేళ్ళల్లోనూ ఊరంతా ముక్కలూ సెక్కలూఅయింది. బ్రాందిషాపులు పలచబడ్డాయి, సారాకొట్లు సగం వైనాయి, కల్లుదుకాణాలు కనబడకుండానే పోయాయి కాఫీహోటేళ్ళు మాత్తరం కావాల్సినన్ని లేచాయి! కాని కల్లు కావలిస్తే కాసీ యెల్లిన ట్టెల్లాలి! ఈదుకాణాలు దూరంగా తరింవేసినోణ్ణి, పడదీసి తన్నినా పాపం లేదు! వోయి రంగ! వోయి రంగా! నాసేతినిండా డబ్బే వుంటే, కాసీ రాంవేశ్వరాల్దాకా కల్లుసలివేంపర్లు పెట్టించక పోయ్యానా! డబ్బున్నా వోళ్ళకొక్కళ్ళకీతల్లో వూకస్నమాట లేదు. (ముందునకు జూచి) అదుగో సిపాయి సిన్నయ్యతాత! (పరిక్రమించి ఏం సిన్నయ్యతాతా! యెల్లా వున్నావు?

చిన్న—(ప్రవేశించి) అదిగో, రంగ డెప్పుడో రంగన్నుంచిదిగాడే?

రంగ—మొన్నటి వోడలో వొచ్చాను తాతా!

చిన్న—ఎన్నాళ్ళ కొచ్చావు! ఏంవిటి రంగం విసేసాలు?

రంగ—అబ్బో! రంగం సంగతి సెప్పడానికి నాతరంవా, నాయబ్బ తరంవా! ఎవణ్ణి సూసినా, సేతినిండా డబ్బు, కడుపునిండా సారా! పెతియాదిని బ్రాందిషాపు, సందుసందుకూ సారాకొట్టు! బ్రాంది సారాలు తాగితే బర్మావోడే తాగాలి; అయితే, రమ్ము సారా వొచ్చాక, రంగాన్ని కూడా షోకుతగ్గిందంట.

చిన్న—మేం వెళ్ళిన్నాటికి రమ్మింకా రాలేదు.

రంగ—ఏంవిటీ! అయితే నువ్వు రంగం సూశా వన్నమాటే!

చిన్న—వొక్కరంగంవేనా?, రంగం మోరీను, టోకీ, సింగపూరు, మాండలే, వొకటేంవిటి, ఆటాపంతా సుట్టబెట్టాం. అసలుఆపా

రాజును పట్టుకున్న దెవరు? మేఁవు కాదూ? అప్పుడేగా ఆకా శాన్నుంచి సుక్కలు రాలాయి! మాపటాలఁ వెళ్ళకపో తేమూండ ఠీకోట దొరికేదా! ఆరాజు సింవాసనాన్ని ఆరువొందల వజ్జిరా లున్నాయి! కోటలో యెటు తిరిగినా కోడిగుడ్డం తేసిరత్తినాలు కాళ్ళకు తగ లేవి!

రంగ—రత్తినాలేనా! రమ్ముసారా యేఁవైనా వుండేదా?

చిన్న—రమ్మింకా రాలేదన్నాగా? ఇట్టేఁవొచ్చి నంత యిప్పసారా పట్టసారా దొరికాయి.

రంగ—అయితే నువ్వూ సేనాసారాలు సూశా నన్నమాట!

చిన్న—సూశాను గానీ, 'వాఁవుమంతరం నేర్చుకున్నాక, పత్తిరి సేవ మొదలెట్టి, కల్లు సారాలు కంట సూట్టం మానేశాను.

రంగ—సరేగానీ బాబుగా రెల్లా వున్నారు?

చిన్న—బాబుగారు బంగారంలా గున్నారు. అన్నట్టు సెప్ప లేదు! బాబుగారు పడ్డప్పుడు నువ్వు సేసిన సేవకు, బగుమతి యివ్వడా నికి పిలమంటే, నువ్వురంగం వెళ్ళినట్లు నేనే సెప్పాను. అప్పట్లో నువ్వేంటే అడిగిన యీనాం విచ్చేవారు. నిజంగా బాబుగా రప్పుడు నీమూలాన్ని బతికారు!

రంగ—తప్పు తప్పు. నామూలాన్ని కాదు, సఁవయానికి నాచేతులో వున్న సారాసుక్క మూలాన్ని బతికారు! ఆపడ్డపాటుకే ఆ సుక్క పడకపో తే, ఆపాట్న గుటుక్కు మనవలసిందే!

చిన్న—అయితే బాబు!, అయ్యాగా రీన్నకాడికి తెచ్చింది నీసేతి బోణీయేనా!

రంగ—అదేంట దేంటి? ఏకాడికి తెచ్చిం దేంటి?

చిన్న—ఏకాడికా, (మెల్లగా) తాగికోడంటే తరఁవేశేకాణ్ణించి తాగు మోతుల్నిసూట్టూ కూకుండ బెట్టుకుని, తప్ప తాగేకాడికి! కావాల్సినంత సొమ్ముతో కలకల్లాడేకాణ్ణుంచి,అరవయ్యేళ్లొకా అప్పుసేసే కాడికి! ఈపాలి తెలిసిందా?

# రెండవరంగము

ప్రదేశము.—రఘునాథరావుగారి మేడమీఁద గది.

ప్రవేశము — బ్రాందీసీసాలును గ్లాసులును గల బల్లకుఁ జెరియొకవైపున కూర్చుండి... రఘునాథరావు గారు, శర్మ.

రఘు.—సరికాని, యొక సందేహము —

చ. మనసు తలంపులన స్వైరపు రూపెరి దీప్తి వహించు; బుద్ధి య
య్యనుకరణంబులం గమల మేన్నటిలో యెద్లైవికాసమొందుఁ; జ
య్యని నిఖిలాంగకంబులును యంత్రితమునం ఘటియించినట్లు కా
లును, మధుసేవ యేటికిఁ జెలంగొన నిషేధ మొనర్చిరో బుధులే!

శర్మ.—సందేహము (Doubt) నే నిట్టే క్లియరాఫ్ (Clear off) చేసెద ను గాని, ఇంకొక గ్లాసు కానిండు

రఘు—(నవ్వి) దానిపోటు దానిచేతనే కాని తీఱదు కావలయును!

ఇద్దఱు—(బ్రాందీతో గ్లాసులు నింపి, పానము చేయుచుండ)

రఘు.—దీనితో నీ వెన్నిగ్లాసులు ?

శర్మ.—ఎన్నియో యెక్కడిది? అన్నియుఁ గలిసె నైదేను! మీరో?

రఘు—నేను మూఁడే కాని నాకప్పుడే కుచ్చెలుటలు పట్టుచున్నవి? ఏమి చిత్రమో కాని, యెన్నిగ్లాసులు పడినను నీ వేనియుఁ జలింపనే చలింపవోయి!

శర్మ—అదిగో అదియే మనయొద్ద నున్న యాశ్రయము.

ఉ. తాగుట గొప్పకాదు పది బాటిలు ద్రాగిన మూలమూలలన్
దాఁగక, డీలుఁ గాక, వన త్రాగిన పిట్టనిధాన స్పష్టిగా
వాఁగక, యొద్దకుం జనిన వాసన గొట్టఁగ నీక వీథులన్
దోఁగక; పెంటకుప్పలను దొరక యొప్పుటె గొప్ప నా నయముల.

రఘు—సరే కాని, నా సందేహము తీర్చినావు కావు.

శర్మ—బాబూ! మనపెద్దల తెలివితేటలు మనకుఁ బూర్తిగాఁ దెలిసిన తరువాతఁ గూడ మన కీ సందేహములకు?

హెచ్చినకొలఁది నాచుఱుకుఁదనము హెచ్చినది. నాచుఱుకుఁ దనము హెచ్చినకొలఁది యాయుష మక్కయు హెచ్చినది. ఆనాఁ డావిధముగా నాయన పెట్టిన బిచ్చ మువిఘ్నముగ నేఁటికిని సాగుచున్నది! నాకథ యిది. దయచేసి. మీకథ కూడఁ జెప్పితిరా వినియానందించెదను, మీరుపక్రమించులోపల నొకసారి మరల నోరు తడుపుకొనెద. (అని మరలనొకగ్లాసు త్రాగును)

రఘు — నాకథ నాకే వింతగాఁ దోచునంత విచిత్రమైనది! మొన్న మొన్నటివఱకును, మద్యపానమును నాకంటె నిరసించువారు మనయిండియాలో లేరు! ఆస్పత్రిలో, నొకనాఁడు నేనొక క్రొత్త గుఱ్ఱమునెక్కి షికారుపోవుటయు నొకచోట నది బెదరి బెగ్గలు పడుటయు నేను దత్తరిల్లి తలక్రిందగుటయు, తల పగులుటయుఁ దటస్థించినది. అప్పుటనే, త్రాగినచుఱుక్కై నా గొలువునుండి తొలగింపఁబడి, దైవయోగమున, నా పసుపవున నాచేరువకు వచ్చియున్న నాపరిచారకు డొకఁడు నాపాటు చూచి, చప్పునఁ దనకడనున్న సారాయి యింత నోటఁ బోసెను! అమ్మగతలోఁ గిమ్మనకుండ నాచుక్కలు మ్రింగితిని! అప్పు డెఱ్ఱఁగిన దంతవఱకే. మఱునాఁడు మధ్యాహ్నమునకు మరలఁ దెలివి వచ్చినది. కాని, తాళవశముకాని తలపోటు! డాక్టరు నాబాధ చూచి, గ్లాసుతో నింత యరఖు తెచ్చి పోసెను. దానిచే మరల మైమఱచి నిద్రించితిని. కాని మెలకువ రాఁగానే తలపోటు మరల దాపుర మైనది! మరల డాక్టరు మందు తెచ్చి పోసెను. ఈ విధముగాఁ దెలివి వెంబడిని తలపోటు....తలపోటు వెంబడిని డాక్టరు గారి పరమౌషధము!

శర్మ — సరే, సంగతి బోధపడినది. ఆ పరమౌషధము బ్రాంది!

రఘు — యూ ఆర్ రైట్! (You are right) కాని యాసంగతి నాకప్పటికి దెలియదు. గాయముమానినపిమ్మటఁగూడ గ్రహచారపుఁదలపోటు మానకపోఁగా, డాక్టరు తా నిచ్చుచువచ్చిన యరఖు

మది యని తెలిసి -. బాధానివృత్తి యగువఱకును బ్రాందిసేవ తప్పదని చెప్పెను! ఇంకఁ జేయవలసిన దేమున్నది?-

ఉ. పదిలముగా గవాటమును వైచి, యొకండనె కూరుచుండి యీ
గది నొక కొన్నినాళ్ళు- నిటఁ గాదని మావనవాటి కేగి పూ
బొదలను గొన్నినాళ్ళు-నిరుపూఁటల మంచుగఁ గ్రోలి క్రోలి, హా!
తుద కిటు రేవు మాపులను దుష్టిగఁ ద్రాగెడుదాఁక వచ్చితిన్!

శర—ఇంకఁ జెప్పనక్కఱలేదు. ప్రపంచమునందలి పై తరగతి త్రాగుబోతులలో-వందకుఁ దొంబదిమంది వైద్యులవల్ల వక్రించినవారే!

సీ. తథ్యము వచింతు- మద్యసుందరికి గన్న
తండ్రి వైద్యుఁడు, వెలయాలు తల్లి; వైష్ణ
వుండు చెలికాఁడు; తద్వర్తకుండు బావ;
జారులుం, జోరులు, నిశాచరులు, మంత్రి
వాదులుం, జూదరులు, నటుల్ వలపుమగలు!

రఘు - అయినను, నేనాయన చెప్పగానే మెత్తబడలేదు. అనేక సాధనములుచేసి చూచినాను. కాని, దానితోఁగానితలపోటు తగ్గెడిదేకాదు! చివరకొక సంవత్సరమునకాశిరోవేదనపోయినది. అయిననేమి అప్పటికి యది వెన్నెముకవఱకును వేరుతన్నినది!

శర్మ—(తనలో) కనుకనే, మావంటి వాండ్రకింత గ్రాసము దొరకు చున్నది! (పయికి) అయిన, నందులకు మీరన్యథా భావింప నవసరము లేదు.

* ఏలిటిల్ విస్కీ, నౌ అండ్ దెన్,
యీజ్ రెలిష్డు బైది బెస్టు ఆఫ్ మెన్.

అని కారికలే యున్నవి. అది. కాక - మీరు గుఱ్ఱముమీఁది నుండి పడినప్పుడు మీ సేవకుడు పోసినచుక్కలే మీప్రాణములను నిలిపినవి. కాకున్నఁదోడనే కాళ్లు సేతులు చల్లబడెడివి. మద్యము యొక్క మహిమకు మేర యున్నదా!

---

*A little whisky, now and then, is relished by the best of men,

సీ. కసుగందు వాఁడొక గ్లాసు వేసినతోనె
హనుమంతునకు గంతులాట సేర్పు
మూగవాఁ డొక డ్రాముం గొన్నమాత్రాన
వేనోళ్ల శేషుని వెక్కిరించు
పిఱికివాఁ డొక యౌన్సు పీల్చినయంతనే
యుత్తరు చెంపపై నూచికొట్టు
పుంస్త్వహీనుం డొక పుడిసెడు గొనఁగానె
సింహబలుం బట్టి చిత్తుచేయు
పరమలోభి యొక్క పాత్రెడు సేవింప
దానకర్ణుఁ దరిమి తరిమి కొట్టు
శోకభరితుఁ డొక్క సోలెఁడు క్రోలిన
నొడలు మఱచి హర్షజలధి మునుఁగు!

గోపు —(నవ్వి) ఇదిగో—యీ సీధోరణియే యిందులకు నిదర్శనము!

శాస్త్రి—నామాటలు మీరట్లు నవ్వులఁ బుచ్చఁదగినవి కావు. జగత్ప్రఖ్యాతి వడసిన—షేక్స్పియర్ త్రాగుబోతు, షెరిడెన్ త్రాగుబోతు; విల్సన్ త్రాగుబోతు, నెల్సన్ త్రాగుబోతు; మనలో వ్యాసుఁడు త్రాగుబోతు, వాల్మీకి త్రాగుబోతు; కాళిదాసు త్రాగుబోతు; కబీరుదాసు త్రాగుబోతు; ముప్పదిమూడుకోట్ల దేవతలు త్రాగుబోతులు, మును లందఱు త్రాగుబోతులు. ఇప్పటి నాగరక ప్రపంచములో త్రాగనివానికి తావే లేదు! త్రాగినవాఁడేయూరికితలమానికము—త్రాగినవాఁడేనలుగురిలో తగవరి! త్రాగినవానికే యూరిలో దాక్షిణ్యము—త్రాగినవానికే యింటిలో ధర్మపిండము! త్రాగినవానికే సభలో తాంబూలము—త్రాగినవానికే మేజువాణీలో దండము! ప్రభువు త్రాగక పాలింపలేఁడు. సేవకుఁడు త్రాగక సేవింపలేఁడు! వకీలు త్రాగక వాక్కు మెదపలేఁడు. వైద్యుఁడు త్రాగక వ్యాధినిగనిపెట్టలేఁడు. కవి త్రాగక కలముపట్టలేఁడు—గాయకుఁడు త్రాగక కంఠమెత్త

లేడు! పూజారి తాగక పులికాపు పెట్టలేడు - అర్చకుడు తాగక హారతి పట్టలేడు! వంటవాడు తాగక వండలేడు- వడ్డనవాడు త్రాగక వడ్డింపలేడు! పెండ్లిలో తాగుడు, పేరంటములో తాగుడు, విందులో తాగుడు, వీడుకోలుపులో తాగుడు, క్లబ్బులో తాగుడు, గ్రంథకుటిలో తాగుడు, రచ్చలో తాగుడు, రైలులో త్రాగుడు, భోగములో త్రాగుడు రోగములో తాగుడు, చావులో తాగుడు, శ్రాద్ధములో తాగుడు! ఈవిధముగా తాగుడు. ఇష్టదైవమువలె నిహపర సాధనమై-పదుగు పేకలవలె ప్రపంచమంతయు నిండి-గాలి వెలుగులవలె గౌరవాదరములను బడసినది. పడయుచున్నది, పడయనున్నది!

సోమ — (పకపకనవ్వి) ఓరీ నీ లెక్చరు కాల! టెంపరెన్సు సొసైటీ వారి (Temperance Society) దుంప తెంపెడునట్లున్నావే! సరికాని, యీదుర్వ్యసనమున కిందఱులోనగుటకుఁగారణమేమి?

రఘు — దాని మహిమయే దానికిఁ గారణము. ఆమహిమ కంతున్నదా

సీ. బ్రాందిసీసా కంటఁ బడఁగానె వరహాల
పాతు కాన్పించినపగిదిఁ దోఁచు!
పెప్పు మంచును గార్కు చప్పుడైనంతనె
జయభేరి విన్నంత సంబ్రమొదవు!
దొడదొడ గ్లాసులోఁ దొలికించు సమయాన
నమృతంబు పడుచున్నయట్టులుండు!
చుఱచుఱ గొంతులోఁ జొచ్చెడు తఱి, పోయి
నట్టిప్రాణము వచ్చినట్టులొప్పు!
అవల, నానందవార్ధి నోలాడునట్లు
స్వర్గభూమి విహారము సలుపునట్లు
రంభ యొడిలోన నిద్దుర గ్రమ్మినట్లు
తన్మయావస్థలోనఁ జిత్తము సుఖించు!

రఘు—అసహాయవాదులు దాని నంత మొందింపఁజూచుచున్నారే.

శర్మ—అసహాయశూరులు కారు సరిగదా – హరిహరాదులు కూడా దాని నంత మెప్పింప లేరు! ఏమందురా? –వారి సహాయకోనఁ గల మహానుభావులు నైసాయి సభలోఁగూడఁ గలరు! ఆపైని ఎలెక్షనులో దాని కిప్పు డెక్కడలేని ప్రాముఖ్యతయుఁ గలిగినది! విన్నారో లేదో మొన్నటి మ్యూనిసిపల్ ఎలెక్షను సందర్భమున–సారాకొట్లు, మ్యూనిసిపల్ కచేరీలమధ్య–హోటళ్లు దిరుపతి మొక్కుల బిచ్చగాండ్రవలె తీట తీఱ దొరలినారఁట! దీనికేమిగాని–క్లబ్బులో గానసభ యుఁట– విశేషమా?

రఘు—చీట్లాట గుంపులో మాసక్లబ్బు–శివలింగ తీర్థనాళ్ళను నుంచి యుంచును గదా–ఆగందరగోళములో గానసభ కూడనా!

శర్మ—అసలు, మీకు, సంగీతమునందుఁ రుచి కలదా?

రఘు—సంగీతమునందుఁ రుచి లేకపోలేదుగాని

చ. బిరడలు త్రిప్పి, తంత్రులను బిస్సబిగించి; ముఖాల్పటించి, తం
బుర శ్రుతిచేసి, గొంతుకఫముఁ సకిలింపుల నెట్టి. గూబపై
కరము గదించి, వాతహారి క్రిమ్మిన చందమున స్వీకారమై
ఖరి సభలోన గింజుకొను గాయకుఁడన్న నసహ్యమే జుమా!

శర్మ—అట్లయిన, మీకాఁడుపాటపైనాదరము హెచ్చునన్నమాట!

రఘు—ఆఁడుపాట, యున్నట్లుండి నచ్చినది. మొన్నరాత్రి గావీన్ నొక పెండ్లియూరేగింపు వెళ్ళినది. ఆయూరేగింపుననుండు గానశాలలో నొకతె పాడినది గదా, ఆస్వరమాధుర్యమే మేమని చెప్పుదును!

శర్మ—స్వరమాధుర్యమేనా – దాని సౌందర్యమాధుర్యము కూడఁ జిత్తగించినారా?

రఘు—అంతవఱకు జరుగుట కవకాశము లేకపోయినది.

శర్మ—(తనలో) సెబాసు! అసలైన ఆపర్చ్యూనిటీ (Opportunity) దొరకినది! ఈసందర్భములో నీతనికి సుమతికలిగించి, దాని యింటికిఁ దార్పఁగలిగితినా–నాయదృష్టము నాలుగుకాళ్ళమీఁద

నచ్చిన వస్తువూ ! బహుకాలమునుండి దానిపై నాకుఁగల భ్రమయుఁ దీరును. ఈ మొజువేత నీఁతశు నాచేతి కీలుబొమ్మయు నగును! ఏమున్నాను (Chance)! టూబర్డ్సు విత్ వన్ స్టోన్ ! (Two birds with one stone)

రఘు—ఏమిటి యాలోచించుచున్నావు?

శర్మ—ఏమని చెప్పఁగలను! దాని యందము చూడలే జనఁగానే నా డెందము కరఁగిపోయినది !

రఘు—అ దేమి? ?

శర్మ—అ దేమేమిటి?—ఆ సౌందర్యరాశిని చూడనివి చూపులా !

రఘు—ఎవ రా యువతి ?

శర్మ—దానితల్లి దానికి పెట్టిన పేరు: కస్తూరి—దాని సౌందర్యమును బట్టి లోకులు పెట్టిన పేరు సెర్చిలైట్ ! (Search light)

రఘు—ఆ కంఠస్వర మాకస్తూరిదే యని నీ వెట్లు చెప్పఁగలవు?

శర్మ—ఆ సమయమున నేనుగూడ నా మేజువాణీలోనే యున్నాను. ఉండకపోయినను జెప్పఁగలను. అట్టికంఠస్వరముకల దీయూరిలో నదితప్ప యింకొక తె లేనే లేదు.

రఘు—(నవ్వుచు)అట్లయిన, నీ వీ యూరిలోని ఆటకత్తెల నందఱ నెరుఁగుదు వన్నమాటయే!

శర్మ—ఎంతమాట! అంతో యింతో చేయునది వైద్యముకదా?

రఘు—అట్లయిన, నీసారి యాసెర్చిలైటీవీథిని వచ్చినప్పుడు — ఎన్ని కాండిల్సు పవరు (Candles power) కలదో చూచి చెప్పుము.

శర్మ—అట్లయిన యా కాండిల్సు పవరు రేపే చూపఁగలను!

రఘు—అ దెట్లు ?

శర్మ—ఎట్లా?— మరల నొకసారి రపంత మధుసేవ చేసి సెలవిచ్చెదను. కాసింత మీరుకూడ కానిండు.

ఇద్దఱు—(గ్లాసులు నింపి నోటఁ బోసికొనుచుండఁగా— తెర పడును)

ఇది ద్వితీయాంకము.

---




# తృతీయాంకము

ప్రవేశము:—కస్తూరి యిల్లు.

ప్రవేశము:—కుర్చీపై గూర్చుండి శర్మ, యెదుట నిలుచుండి కస్తూరి

కస్తూ—పంతులుగారికి నామీఁద నేఁడు పరిపూర్ణకటాక్షము వచ్చినది.

శర్మ—ఇదిగో! మొదలే నేను పుట్టెఁడు మొగమోటముతో వచ్చినాను! అట్టె పెద్దమాటలు విసిరి నన్నడలఁగొట్టకు!

కస్తూ—ఎంతమాట! తాయారుమీఁద మీకు తగనియిష్ట మని వాడుక. అందుచేత నట్లన్నాను.

శర్మ—నిజమే కాని – నీచపుముండ నిలుపుకోనలేక పోయినది! కులమువానిని మరగి కూటిలో మన్ను వేసికొన్నది!

కస్తూ—అట్లయిన, దానియింటికి మీరు దయచేయుటలే దన్నమాట?

శర్మ—నీతోడు! నీతో నే నబద్ధ మాడుదునా? కులమువాఁడు పొరలి వెళ్ళిన ప్రక్కమీఁద–కుక్కిన పేనువలెఁ గూలఁబడవలసి వచ్చినప్పు డాగుమ్మము ద్రొక్కుటకంటెఁ గూడనిపనియున్నదా? ఒక్క తాయారే కాదు– ఇపు డెక్కడఁ జూచిన నిదేకర్మము! కులమువాఁడు ముందు– కిలమువాడు వెనుక!

సీ. సోమరాజులుగారి శోభనాంగికి, దాని
మద్దెల కాఁడె కా మాఱు మగఁడు!
ఆచారిగారి సింహాచలంబునకు గ
జ్జెల మోఁతగాఁడె కా వలపుమగఁడు!
పంతులుగారు చేపట్టిన యిందిరా
మ్మకు ఫిడేల్ కాఁడె కా చాటు మగఁడు!

సాయఁతుగాదు ప్రాణముపెట్టునట్టి ర
త్రికి త్రి త్రికాఁడె కా తేరమగఁడు!
పెద్దకోమటి సాముక్రతోఁ బెరిగినట్టి
మురహారికి తాళిగాఁడె కా ముద్దుమగఁడు!
ఇది యది యనఁగ నేల యే యింటఁ గనిన
కులమువారలె విటులు సానులకు నేఁడు!

కస్తూ—అదోష మెవ్వరి దని మీ యభిప్రాయము?-

సీ. సుబ్బిసెట్టి తెనాలి సుందరియింటను
పక్కలు వైచి దీపములు పెట్టు!
పొట్టిపంతులు విరిబోణి మేళములకు
విడలిన యూరెల్ల వెంబడించు!
కామశాస్త్రులు పూల కనికి కూఁతుండ్రను
మగలఁ దెచ్చుటకు రేపగలు దిరుగు!
స్వామినాయఁడు తన సాని నన్యుల కప్ప
గించి, తా వీధివాకిటఁ బరుండు!
కొండమీఁద నున్న గోఁతి కానలెనన్నఁ
జచ్చి యైనఁ దెచ్చి యిచ్చువారె
పాడుపనుల కిట్లు పాల్పడుచుండంగ
సానిముండ లేమి సలుపకుండ్రు?

శర్మ—ఎట్లయిననేమి, ఎక్కడనో నీవంటిది తప్ప, యేయింటఁ జూచినను, కులమువాని కుక్క కానిది లేదు!

కస్తూ—సరి సరి. నామాటకేమిలెండు, నామీఁది దయచేత నన్నిట్లు పొడిగించుచున్నారు!

శర్మ—నీతోడు! నీసంగతి నీయెదుటఁ జెప్పవలసినది కాదు. నిశ్చయముగా నీవంటివాండ్రు కోటికి నూటికిఁ గొందఱైన నుండుట చేతనే ప్రపంచము నిలిచినది. అందుచేతనే, నిన్నాకాశమున

కెత్తవలెనను తలంపులో, నుంచి స్కీ మొకటి మనసులో స్థిర పఱచుకొని వచ్చినాను. నీతోడు, నీ యంగీకారమే తరువాయి.

కస్తూ—ఏదో విశేషము లేకున్న మీా రేతెంచువారు కారని నేను మొదటనే యనుకొన్నాను. ఏమిటి యాస్కీము (Scheme)?

శర్మ—జమీాందారు రఘునాధరావుగారికిని నాకును, ఐచ్చినఁ జావు బ్రతికిన బ్రతుకు అనునంత ఫ్రెండ్షిప్పు (Friendship).

గీ. కుడుచునప్పుడు నేనును గుడువవలయు
ముడునప్పుడు నేనును ముడువవలయు;
కాయములు మాఱి రెండుగాఁ గానబడిన
మానసం బొక్కటియె కాని మాఱు లేదు.

కస్తూ—అంతవఱకు నే నాలకించినదే.

శర్మ—అట్లయిన నీకు నంతగాఁ జెప్పవలసిన పని లేదు. ఆ (Influence) యిన్ఫ్లూయన్సంతయు నీనిమిత్తము వినియోగించి, నిన్ను బంగారు పిచ్చుకను జేయుటకు నిశ్చయించుకొన్నాను!

కస్తూ—ఏ విధముగా?

శర్మ—ఏ విధముగా నేమిటి?—ఆ మనకును నీకును అతుకు పెట్టి.

కస్తూ—(తనలో) ఇతనిరాక నా కిప్పు డర్థమైనది. కనుక నే నిప్పుడు కాసింత గడుసుతనముగా వెళ్ళవలెను.

శర్మ—ఏమిటి యాలోచించుచున్నావు?

కస్తూ—అనుకొన్న దొకటియు, ఆలకించినదింకొకటియునైనదని.

శర్మ—నీ వే మనుకొన్నావు?

కస్తూ—(మొగము చిట్లించి) సరే, నే నే మనుకొన్న నేమి! అందని మ్రాని పండున కఱ్ఱులు చాచుట యవివేకము కదా!

శర్మ—అనఁగా?

కస్తూ—అనఁగాను లేదు, వినఁగాను లేదు. కాని, ఆరాత్రి మీా రాయూరేగింపులోని కెందులకు వచ్చినారు?

శర్మ—అందఱు నెందులకు వచ్చినారో, నేనందులకే.

కస్తూరి—అలాగునా! ఆమాట తెలిసినచో - అందఱను జూచినకన్ను లనేమిమ్ములను జూచియుండెడిదానను! (అని చరాలునమరలును)

శర్మ—వెళ్లకు - వెళ్లకు - వెళ్ళిననొట్టు! (అని చటాలున లేచి, చేయి పట్టుకొని) ఇప్పు డన్నమాట యేమిటి? - అందఱను చూచిన కన్నులనే నన్నును జూచియుందువా ? అట్లయిన, స్పెషల్ (Special) కంటితోఁ జూచినా వన్నమాటయే ! నిజముగా నామీఁద నీ కట్టి యభిమానమే యున్నచో - నీపాదములపైఁ బ్రాణములు విడువనా!

కస్తూ—అమ్మయ్యో! - ఆపనిమాత్రము వలదు ! బ్రతికియున్నచోఁ బైచూపులతో సైన భ్రమ తీర్చుకొనెదను.

శర్మ—(సంతోషముతో) వహ్వా! వహ్వా! వన్సుమోర్! వన్సుమోర్! ఏమి ఏమిటీ? భ్రమా? - ఎవరిమీఁద? - నామీదనే! ఆ బంగారునోట - ఆముద్దులమాట మఱియొకసారి యను!

కస్తూరి—పిల్లికి చెలగాటము, ఎలుకకుప్రాణపోకడయనునట్లు-నామాట మీ కంత నవ్వులాటగా నున్నది ! అదిగో - మరల నవ్వుచున్నారు! పోనిండు. నే నింక జెప్పనే చెప్పను! (అనిమరలును)

శర్మ—(మరలపట్టుకొని) నాతోడు! నన్ను చంపుకొని తిన్నట్లే ! ఏదేదీ?- ఆరాత్రి నన్నుఁజూచినది మొదలు ?-చెప్పు మఱి-!

కస్తూరి—చెప్పుట కేమున్న దేమిటి?-

ఉ. అన్నము తిన్న నొట్టు ! నిదు రన్నది పోయిన నంతకన్న నో !
మిన్నఁడు నిట్టివింత వినియేని యెఱుంగను ! సిగ్గు సిగ్గు ! నా
కన్ను లివెంత దుండగపుఁగన్నులొ-మీ వదనారవిందముం
గన్నక్షణంబునుండి మిముఁ గాంచుటకే పలవించు నిచ్చలున్!

శర్మ—హాయి హాయి! హాయి హాయి! అదృష్ట మనఁగా నాది! ఏదీ ఆపాటున నొక్కముద్దు పెట్టు! (అని కౌగిలించుకొని ముద్దాడి) ఇదిగో యిప్పుడు నాసంగతి చెప్పెద విను. నీకు నామీంద నిన్ననో మొన్ననో కలిగినది కాని-నీమీఁద నాకు నిరుటినుండి పుట్టినది!అయిన నాస్థితిలో నీయింటఁ గాలు పెట్టుట కిష్టములేక

మ. కనులార నిన్నుఁ గాంచినైనఁ దనియంగా వచ్చు నంచెన్దిరయో
పని యున్నట్టులె, వెళ్లినక్కడ వరుసం బల్లాబు విూ యింటివం
కను దారాడుచు-నీవు మేళముల కేగ న్వోట నే తెంచుచుం
దినములు పుచ్చితి-నా మొర ల్విని యె నాతీ! దైవమిానాఁటికిఁ!

కస్తూ—ఆఁడుదానికిని మగవారికిని గల యంతర మెంత యో చూచి
తిరా! నిరుటినుండి మీరు నివురుఁగప్పిన నిప్పువలె నుండ-నిన్నఁ
గాక మొన్నఁబుట్టిన నావలపు, నేనిట్టె బయటఁ బెట్టుకొన్నాను.

శర్మ—ఇదిగో-నవ్వకుండ, నా మొగమువంకఁ దిన్నఁగఁ జూచి చెప్పు
నీవు నిజముగా నన్ను వలచితివా?

కస్తూ—(చిరాకుతో) ఇదిగోయిదే పురుషుల యొద్దనున్న పుంకు!

శర్మ—సంతోషము సంతోషము. ఆమాట మఱియొకసారి విని యానందింప
వలెనని. కాని-నిజముగా నీయందు నమ్మకము లేక కాదు. నీ
మాట నమ్మనివాఁడు నీయింటఁ గుక్కయై పుట్టు ననుకో!
నచ్చినదా? నచ్చినచో, నావంక నొకసారిచూచి పక్కు ననవ్వు!
ఆఁ! చాలును! ఇక్కడి కొకరిమన సొకరికిఁ దెలిసినది కనుక, నిఁక
ముందుసంగతినిగూర్చి ముచ్చటింతము. నీకడ నిఁక వ్యాపరిక
మేల-నా మెడికల్ ప్రాక్టీసువల్ల నాకు వచ్చునది నాసిగ రెట్లకు
జాలదు. అట్లుగాక, నిన్ను నేనే భరింపఁ గలిగినయెడల
చక్రవర్తికైన నీసాన్నిధ్యము దొరకనిచ్చువాఁడను గాను.
అందువల్ల, రఘునాథరావుగారిని నీకతుకుపెట్టి, ఆయనద్వారా
నిన్నాకాశమున కెత్తుటకును-ఆయనచాటున నీతో నానందించు
టకును నిశ్చయించుకున్నాను. నీవుఁగూడ దీనికి 'ఎస్' (Yes)
అంటివా – నీకు నా మీఁద నిజముగాఁ బ్రేమయున్నట్లే లెక్క.

కస్తూ—ఎస్సో గిస్సో నా కేమియుఁ దెలియదు. మగవారి యాలోచన
మగవారికేగాని – అభము శుభము నెఱుఁగని యాఁడుదాని
కేమి తెలియును? అందును నేను వట్టి యమాయకురాలను.
నాకంటికి నల్లని వన్నియు నీళ్ళు, తెల్లని వన్నియుఁ బాలు. నీట

ముంచినను బొలముంచినను మీయొదేభారము. అవగింజంతకూడ విూ మాట కెన్నఁడు నష్టము చెప్పుదానను మాత్రము కాను.

శర్మ — అదిగో - అదీ మాట! ఆమాటమీఁద నీవు నిలువఁబడితివా— యెల్లుండికి నీయొంటిని ఏడువారముల నగలు తగిలించి, ఆవ లెల్లుండికి అయిదంతస్తుల మేడమీఁదఁ గూర్చుండఁ బెట్టు భారమునాది. ఈరాత్రి రఘునాథరావుగారి సిచటి కీడ్చుకొని వచ్చెద. ఒక రహస్యము— ఆయనకుఁ గొంచెము చుక్క యల వాటున్నది; సరే నా సంగతి నీవు వినియే యుందువు. అన్నట్టు, నీ కేమయిన రవంత యలవా టున్నదా?

కస్తూరి—(తనలో) రవంతశర్మమేమి? పూటఁకు బుడ్డి చాలదు. (పయికి) నా కంతగ నలవాటు లేదు - మీవంటివారు తటస్థ పడునప్పుడు మితముగాఁ బుచ్చుకొను వాడుక కలదు.

శర్మ—సరి యింక నేమి - చాలును. ఇంకొకటి. ఇంతవఱ కాయన బాగింది విస్కీ లే కాని - పయిరుచు లెఱుఁగఁడు. పడఁదీసి నీ విప్పుడు పయిగంథములోనికి దింపవలెను. అప్పుడు కాని మన కాయన యందకురాఁడు, తెలిసినదా? - సోడా విస్కీలు నేను బంపెదను. తక్కిన పదార్థములు నీవు తయారుచేసి సిద్ధముగా నుంచుము: నేను పోయిరానా?

కస్తూరి—అమ్మయ్యో! అప్పుడే వెళ్ళెదరా! శీఘ్రముగా వచ్చెద నని నా చేతిలోఁ జేయి వేసినఁ గాని- నేను వెళ్ళనీయను.

శర్మ—ఓసి వెఱ్ఱిముండా! నిన్ను విడిచి నేనుమాత్రము నిమిష ముండ గలనా! అమ్మచో - తొమ్మిది కొట్టునరికి ఆయనయు నేను నిక్కడ నుందుము. ఒక్కటే మాట— ఆనూస మాయనది. అనుభవము మనది. ఈ మాట మనస్సులో నిడికొని, యెట్లు మసలవలెనో యట్లు మసలుము. ఒక్క ముద్దేదీ?. (అని ముద్దు పెట్టుకొని, నిష్క్రమించును )

కస్తూ—(కుర్చీపైఁ గూర్చుండి) మొత్తముమీఁద నీతనికి నాపై మోజు గానే యున్నది. రఘునాథరావుగా రీతనిచేతి కాట్నఫుఁ

దిరుగుడుగా నున్నట్టిదివరకు విని యే యున్నాను. ఏమో కస్తూరి రేఖ బయటబడు కాలము వచ్చిన దేమో! ఎందులకు గొప్ప గాని మండలకుఁ గూడ నెంత లేసి భాగ్యము పట్టలేదు!

సీ. కూటికిం గుడ్డకుఁ గూడఁ దిప్పలు వడ్డ
మీనాక్షి యగ్రాల మేడ కట్టె!
విటులకోసము వీధి వీధియుఁ దిరిగిన
మాణిదివాణంపు రాణి యయ్యె!
కడకు బేడకుఁ గూడఁ గక్కుర్తిపడినట్టి
కనికికి మోటారుకారు లేదవె!
పగలు గన్నానసఁ దప్పక రాత్రి కల నగ
పడు రంగి జట్కాకి ప్రాణ మయ్యె!
వర్తకుడు, వైద్యుడు, వకీలు, వారకాంత –
యనెడు నీ వకారచతుష్టయము దె లక్ష్మి
ఆదినో, మధ్యనో, లేక యంతమునసో
వెలిగి తీఱును రిల నొక వెలుగు వీరు.

మఱియొక విశేషము.

గీ. వర్తకున కూర సేదయు; వైద్యున కొక
పతకమును: న్యాయవాదికి బంకి; వేశ్య
కున్నతప్రాకారం బిది యొకవనేని
పరపతియు, గౌరవము, నచ్చుబడియు హెచ్చు.

కాని, నేను మూర్ఛగింజ వ్యవహారములోఁ బడి కర్తవ్యము మఱచినాను. సోడా విస్కీ లతాడు పంపును. ప్లేటు కోడిపిల్లతో పయినంతలును సిద్ధము కాగలవు. నా ముస్తాబున కేమిటి దారి? అందును. దొంగకుఁ జీకటివలె – వేశ్యకు వేషమే యంగరక్షకము. నా తల్లిముండ – పగలె కాక సన్నచీరలు కూడ సారాయి కొట్లకు సమర్పించుచుండుటకుఁ జచ్చిన దేకాదు! నా తల్లిని, నన్నును గూడ మించినవాఁడు నా తమ్ముఁడు! అయినను; వారి జనవలసిన పని లేదు.

చ. తలఁపగ వారకాంతలకు త్రాగుడు; పాములకున్ సుషుప్తి; లో
భుల కమితవ్యయేచ్ఛ; గల పుత్త్రిలు; చోరులకుం బణంబు; కా
ఫుల కెడ లేకపోస్త్రాగనద్రల్; పనివాండ్రకు బద్ధకంబు; బా
పల కసహ్యకోపమును బాప్తిలకుండినఁ బట్టి శక్యమే!

వెంకటేశము - (సత్వరముగాఁ బ్రవేశించి) అక్కయ్యా! అక్కయ్యా! అగ్నిహోత్రంలాంటి జేరం తగిలింది. అదేంవి టల్లా వున్నావు?

కస్తూ.—నా యొంటికేమి కాని, ఏమి యీ జేరము?

వెంక—కాశింసాహేబు నీమీద కన్నేశాఁడు.

కస్తూ—ఏ కాసింసాహేబు? సిరంవారి మేడలోనిసిల్కుబట్టలవర్తకుఁడా?

వెంక—అతఁడే అతఁడే! నిన్న గుమ్మంలో నుంచుండగా నిన్ను చూశాట్ట- అప్పణ్ణుంచీ, అట్టుడికిన ట్టుడికిపోతున్నాఁడు. నట్ట నాజముండాకొడుకు! నేల చూపి నెత్తిగొట్టొచ్చును. ఇదిగో- యీచొక్కా- అత డిచ్చాఁడే. చెపితే నమ్మవు- చేతి కెముక లేదు! రవంత నువ్వు రంగు చేశావంటే రక్తం పీల్చినట్టు పీల్చెయ్యొచ్చును వీధిలో నుంచోబెట్టి వచ్చాను. ఏం వంటావు?

కస్తూ—అట్లయిన, నొక సంగతి చెప్పెద నాలకింపుము: ఈ రాత్రి జమీందారు రఘునాథరావుగారు మనయింటికి రాఁగలరు-

వెంక—(ఆశ్చర్యముతో) ఏవిటీ! జమీందారుగారే! అబ్బో! అబ్బో! అయితే యింకేవీ!- అదృష్టదేవత మా అక్కయ్య చుట్టకు అగ్గిని వ్వందించిందన్నమాటే! కల్లుకొట్లకు నేను కాసుమీద వెళ్లా నన్నమాటే! వా! వా! వొళ్ళుగరిపొంగుతోంది! అయితే! అక్కయ్యా! యీకబు రెల్లా వొచ్చించి?

కస్తూ—ఆసంగతి పిమ్మట చెప్పెదను. ముందీసంగతి విను: పనివచ్చుసరి కింట నొక పట్టుచీరయైన లేకపోయినది. సాహేబుకడ నొక సిల్కుచీర సంగ్రహింపఁగలవా?

వెంక—అబ్బే-అదెంత పని. కాస్త నువ్వు కొంగు తాకించావంటే కావల్సినన్నిచీర్లు. ఇదుగో-యీాఁప్పుకొస్తా, నుండు! (అని వెళ్లును)

కస్తూ—తురకనరసమునకు రవంత చుఱుకుదన మవసరము- చుఱుకుదనమునకు రవంత చుక్క యవసరము. (అనియుంబమారులోన బ్రాందిసీసా తీసి కొంచెము త్రాగును.)

వెంక—(కాసింసాహేబుకు బ్రిచయించును.)

కస్తూ—(మందహాసముతో) సలామండి- సాహేబుగారు !- సలాం

కాసిం—(కంగారుతో) సానివారూ మాకీ సలాం సెప్తే- సానివార్కి మేం-సలాం మీాదా సలాం సెప్తాం! (అని సలాం చేయును-)

వెంక—అక్కయ్యా! సాహేబు బావయ్యగారికి నీమీాద చాలా సరదా పుట్టింది. నిన్నటున్నించి నీకోసం- నిప్పు త్రొక్కిన కోతిలా గున్నారు. వొళ్ళు ముద్దెడితివా- వొందరూపాయి లిస్తారు. ఏం బావయ్యగారూ?

కాసిం—ఠీక్ ఠీక్ ! మనుషులోదీ మాంటా- బయటికీ- బరాబక్ తీసి- మీా ముంగలా యేశాడ్. ఘుమ్మంలో మిమ్మల్ని సూశాం- ఘుప్పునా మొఖాన్ని ఖనూ్నసేశాం- ఘుండెల్లో, ఘుబుల్ ఘుబుల్ బయెల్లింది. సాపుకీ యెల్లాం- సంమగాకాడా కూకున్నాం-ఘుండెల్లో, ఘుబుల్, ఘుబుల్, ఘుబుల్ ! నమాజ్ సేస్కున్నాం- నాస్తాకాడా కూకున్నాం- ఘుండెల్లో, ఘుబుల్ ఘుబుల్ ! ఘుబుల్ ! బీడి గీడి కాల్సుకున్నాం-బిశానామీాదా తొంగున్నాం. ఘుండెల్లో, ఘుబుల్ ! ఘుబుల్ ! ఘుబుల్ ! కంటికీ రెప్పొ తగిల్తే-గాడ్డీ మాదీ వొఖటి !

కస్తూ- మీా గుబులు నేను తీర్చెదఁ గాని- యిటు వచ్చి యీా కుర్చీపైఁ గూర్చుండుఁడు.

కాసిం—మాకీ కూకో మంటే కూకుంటాం- మల్లీ- గులామల్లీ కన్మంటే-గులామల్లీ అవుతాం.

వెంక—బలే! బలే! మా బావయ్యగారిమాటే పద్యమైంది!

కాసిం—(సంతోషముతో) అరే! అరే! అరే! మాదీ మాట-కూడా ఆడిందీ పోయ్! మంచీమాట సెప్పింపాన్కి మల్లీ-యీనా

ఏస్తా ఫుచోక్ ! (అని జేబులోని రూపాయలు తీసి) ఏక్, దో, తీన్, చార్, పాంచ్, ! (అని చేతిలో వేయును).

వెంక—(తనలో) నాది నాకు ముట్టింది ! ఇప్పుడు నా ప నేమీ లేదు. ఇంతలో వోసారి కొట్టుకాడికిపోయి చక్కావస్తాను. (నిష్క్ర—)

కస్తూ—ఇటువచ్చి కూర్చుండఁ రేమి? (అని చేయిపట్టి లాగును).

కాసిం—(పారవశ్యముతో) హాయ్! హాయ్! క్యామజా రే బాబా! క్యామజా!

కస్తూ—అయ్యో దేవుడా ? అదే మట్లు కనుగ్రులు తేలవేయుచున్నాడు ! కొంపతీసి గోవింద కొట్టడు గదా ! (చేయి విడుచును)

కాసిం—అరే ! అరే ! సచ్చీపోయాం ! సచ్చీపోయాం ! సానీవారూ ! మీకీ సలాం సేస్తాం-సెయ్యికీ సెయ్యా తగిలిపిచ్చి-సెనంవుంచారు కోండి ! మీదీక్తై తగిలేతల్కి-మాదిపానం మక్కా-యెల్లింది!

కస్తూ—ఆలాగుననా ! అట్లయిన, నీసారి రెండుచేతులు తగిలించెద లెండు. (అని రెండుబుజములమీఁదను రెండుచేతులు వేయును)

కాసిం—(పారవశ్యముతో) అచ్ఛా ! అచ్ఛా ! అల్లా మీ సేతుల్లో అవల్ ఖుషీ- బలె సౌఖ్యం పెట్టాడండీ ! అందుకుశాత- బలే బలే వోళ్లంతా- మీ పాదాల్ మీదా పాపం యేస్తాక్.

కస్తూ—మా చేతులకు విూ అల్లా మఱియొక గుణముకూడ పెట్టినాడు. మీ జేబూలలో బ్రవేశించునఱకును మిలమిల లాడక మానవు. (అని జేబులు తడవి, యందలినోట్లుతీసి) అఁఅఁ,నోట్లు, నా కొరకే తెచ్చియుంటారు. నబాబు దర్జా యనగా ఇది.

కాసిం—అదీ మాట ! ఆఫ్కా దయా మాకీ మల్లంగా వుంటే, కుక్కల్ సేతా నోట్లూ కుప్పల్ కుప్పల్ కక్కిస్తాం.

కస్తూ—అంతవారే మీరు. అన్నట్లు కూర్చుండరేమి? (అనిలాగును.)

కాసిం—వొస్తాం ! వొస్తాం ! జరా నిలంజీ ! (అని కాళ్ళ చెడావులు తీసి చేతఁ బట్టుకొని) బస్ ! చెలో !

కసూ—(నవ్వు బిగఁబట్టుకొని) చేతిలో చెడావు లెందుకు ?

కాసిం—క్యా ! చెడావ్ చోడ్దేనా ? అచ్ఛా (జోడు క్రింద వైచి కూర్చుండి) మళ్లీ మీరూక్కోండీ మాపానం వోరుస్తాదండి?

కస్తూ—అట్లన నిదిగో కూర్చుండెద. (అని యెడలో కూర్చుండును)

కాసిం—(పారవశ్యముతో) అచ్ఛా! బాహుతచ్ఛా! అవల్ ఖుషి యిస్తా (అందుకుండి! అహూరా మస్తానా పలావ్ దేక్నాలోపక్కా మేసీ, మాల్దిమాపక్లో మకాం సేసీ, హాల్వామేసీ, హాంజూరా కొర్కి, బీడీ, కాల్చి, గుణాకే ఖిల్చి, గుమ్మ్రుయ్యా పోయ్యింది.

కస్తూ—సరి కాని; సాహేబుగారు! మీకీ గడ్డ మెందులకు?

కాసిం—బోల్నా? కాపోడ్కి కాడి: కమ్మోక్కి పాడీ; గుమ్మోక్కి సీడీ, ఖులాసాకి బీడీ; పసిసోళ్ళకి గోడీ: పలావుకీ కోడీ: రవుత్కి ఘోడీ: రండేకి కౌడీ; ముల్లుకి జీడీ; ముసల్మాన్కి దాడీ; ముఖ్యం, ముఖ్యం. మీ అందాన్కి తోడూ మీమూత్కి దాడివుంటే, సజ్జఫరీ మీ పాదాల్కాడా సచ్చింది మాట

కస్తూ—అయితే, హిందువులకు మీ కన్నిటి వ్యతిరేక మట కా?

కాసిం—అదీ మాటా! హిందువాడూ మీదా పెంచి కిందా గొర్గితే, మాదీ కిందా పెంచీ, మీదా గొర్గుతాయ్. హిందూవాడూ హెడం నుంచీ ఖుడ్కిరాస్తే, మాది ఖుణ్ణుంచి హెడాన్కి రాస్తాయ్. హిందూవాడూ పేదం నమ్మితే, మాకీ ఖురా నమ్ముతాయ్. హిందూవాడూ శపం చేస్తే, మాదీ నమాజ్ సేస్తాయి. హిందూవాడూ కాసీయెత్తే, మాదీ మక్కా యెల్తాయ్.

కస్తూ—హిందువులు కాళ్ళతో నడువ! మీరు తలతో నడప రేమి?

కాసిం—మాకీ తలా నేలకి తగిలిపిస్తే మాసీపోదండీ?

కస్తూ—మాసిపోయినచో, మడేలువానిచే నుతికించుకొనవచ్చునుగా?

కాసిం—వుత్కితే దాడీ వూడీ పోదండి?

కస్తూ—(పక పక నవ్వి) అదా వచ్చినచిక్కు? (తనలో) అవురా! అమాయికత్వము! కనుకనే, యంతసామ్రాజ్యమును గంగలో గలిపి, కట్టుపనికిని, గుమ్మము కావలికిని సిద్ధమయినారు, (పయికి) సాహెబుగారు! మీ పూర్వు లెంతటివారో యెరుగుదురా?

కాసిం—జర్రా సెప్పండి యింటాం.

కస్తూ—చెప్ప మనెదరా? (అని లేచి)

సీ. భరతఖండం బెల్ల పాలించి సిరులతోc
దూగినవారు మీా తురకవారు

కాసిం—అదీమాట, యిండండి యినాం. (అని యుంగర మిచ్చును)

కస్తూ—వీరులై పోరుల వీరాధి వీరుల
గుర్తించినవారు మీా తురకవారు

కాసిం—అచ్ఛా! అచ్ఛా! మాసేత్కి కత్తియి స్తే మజా సూస్తాం.

కస్తూ—నవరత్న సింహాసనంబులc గూర్చుండి
తొడరినవారు మీా తురకవారు

కాసిం—(దిగ్గున లేచి) ఛూ, కుర్చీమీాదా కూకుండీ—కుక్కా అయ్యాం.

కస్తూ—భోగంబులనందును త్యాగంబునందును
తులలేనివారు మీా తురకవారు

కాసిం—బరాబర్! పండగా దిక్తే, పలావ్ మీాదా పడీ సచ్చీపోతాం!

కస్తూ—శూరవరులకు జాగీరు లూరి కొలువు
కాండ్రికెల్ల మిరాసీలు కవుల కగ్రి
హారములు, పండితులకు మాన్యంబు లొసఁగి
తులఁగలించినవారు మీా తురకవారు?

కాసిం—అదీమాటా! అంతా సెప్పించాన్కి సానీ వార్కి మేం
సంతోషం సేస్తాం, కోరండి, అఫ్కా ఖుషీ, కోరండి!

కస్తూ—మాట తప్పరుగద?

కాసిం—మాటా తప్తే, తురకా బిడ్డా మానీ, దూదేక్ బిడ్డా బోలో!

కస్తూ—అయితే, యీరాత్రి సిల్కుచీర కట్టుకొని హాయిగా మీాతో
నుండవలె నని యున్నది. పంపెదరా?

కాసిం—యిస్కా మాకీ తుబ్డా యిదా సెప్పిందీ. కాకిమీాదా యేసీ,
కట్టా సీరల్ పంప్తాం—తమర్కి నచ్చీఅయిందీ రీతాఫ్ సేస్తోండి.

కస్తూ—కాకిమీాదను వలదు. గాడిదమీాదను వలదు. అదుగో మా
తమ్ముడు వచ్చుచున్నాడు. అతనిచేతcబంపుcడు.

కాసిం—అదీమాఁహా! సోదాగం'గా హావ్వే తల్కీ, హాక్డా సీరల్ హిక్డా హుండ క్ఫోతే– మాడీ బాల్– మంజూర్ సెప్పకండీ.

వెంక—ఏఁవి టక్కయ్యా! యేమిటి?

కస్తూ—మీఁతురక బావగారు సిలుకుచీర లిచ్చెదరట. వెంట వెళ్ళుము

వెంక—వో! రండీ బావయ్యగారూ, రండీ! (అని పట్టి లాగును.)

కాశిం అరే! హుండూ వోయ్ హుండూ! హుకుం తీస్కోనీ సలామండీ సానీ ..రూ. సలాం మన్నా మీకీ తగిల్పిచ్చి–హూది పెరీళం సాపుకీ యెల్తాయ్. సీ–ా కట్టే మీర్ సిద్ధంగా హుంటే మళ్ళీ వచ్చి మేం మజాఖా సూస్తాం! చెలో– సాలా!– చెలో, (అని వెంక లేశముతో నిష్క్రమించును.)

కస్తూ—ఇక్కడికి చీరబెంగ దీఱెనది!

సీ. ఱతిపోయిన చుట్ట కగ్గి చేకురినట్లు
ఆఁకటితఱి నన్న మమరినట్లు
లేవడిలో లాటరీ వచ్చి పడినట్లు
పొరుగూరులో నవ్వు పుట్టినట్లు
నట్టేటఁ జేతికి నావ చిక్కినయట్లు
కఱవులో వర్షము కురిసినట్లు
బగ్గువేసఁగి నింట బత్తె యీనినయట్లు
పై బేస్తులో నాట వడినయట్లు
సమయమున కేగుదెంచి యీ సాహెబయ్య
పయికమ్మూ యిచ్చె, చీరలుం బంపుచుండె,
మంచిదినములు కడు సమీపించెననుట
కింతకన్న నిదర్శన మేమి వలయు! (తెర పడును.)

ఇ ది తృ తీ యాం క ము




# చతుర్థాంకము

## మొదటి రంగము

విశ్వా—(కాగితములు చేతఁ బట్టుకొని ప్రవేశించి) సందియ మేమీ!—

గీ. మూర్ఖభూపతిసేవయు, మూర్ఖరోగి
వైద్యమును; మూర్ఖ భృత్యుని పాలనంబు;
మూర్ఖ శిష్యుని చదివింపు, మూర్ఖ భార్య
పొత్తు—పగవాని కేనియుఁ బొసఁగరాదు!

మా ప్రభువు మూర్ఖ ప్రభువు కాకపోయినను, మధుసేవా పిశాచ మావహించినది మొదలు — ఊసరవెల్లివలె — ఉదయ మొకరంగు, సాయంకాల మొకరంగులోకి దిగినాఁడు! ఆ పయిని, శనిగ్రహమువలె నీ శర్మ యొకఁడు దాపురమై—మఱింత మాసివేయుచున్నాఁడు!

సీ. పడుచుఁదనంబు, స్వేచ్ఛయును, భాగ్యము, త్రాగుడు; దుష్టమైత్రియే
ర్పడ నివి యొక్కటొక్కటియె బ్రహ్మను సైతముఁ బిక్కవానిక
న్నడపి, వివేకముం గెడపి, నాశ మొనర్పఁగఁ జాలి యుండఁగా
నియ్యెడ నవి యన్నియుం గలిసె; నెంతకునేనియుఁ జేక మానునే!

(పరిక్రమించి) దివాణపు వ్యవహారములను దిలకించుట లేదు. జాగు సేయందగని కాగితములపైఁగూడ సంతకములు చేయుట లేదు—ఋణము మాటాడుటకు సమయ మిచ్చుట లేదు! ఆపైని, పయికమునకు హద్దు లేని చీట్లు—అడిగినవడ్డీల కూరిలో నప్పులు ఇంతకు వచ్చినతరువాత నిఁకఁ దరువాయి యేమిటి!

సీ. సమధికం బైన పుచ్ఛాయగ్రహార మీ
మార్గంబుననె కదా మాసిపోయె?
ఘనతరం బగు నినుగంటి సంస్థాన మీ
తీరుననే గదా తిరుగఁబడియె
కోమరైన కొచ్చెర్లకోట ప్రభుత్వ మీ
విధముననే గదా శిథిల మయ్యె
రెపరెప లాడు మారెళ్ల దివాణ మీ
చందంబుననె గదా సన్నగిల్లె
ప్రభువు దుర్వ్యసనంబుల పాలఁ బడిన,
వర్తకుఁడు కాఫీహోటలు వంకఁ గనిన,
తరుణవిద్యార్థి నాటకస్థలిని బడినఁ
జల్లచల్లఁగ ముప్పు వాటిల్లి తీఱు!

అందును, బ్రాహ్మణ సంస్థానముల కస్తమయకాలమొచ్చినది.

మ. వ్యభిచారంబు, దురోదరంబును సురాపానంబు సాగించి; జా
త్యభిమానంబు త్యజించి, యన్యమత వేషాచారము ల్బూని, పా
పభయ మ్మూడ్రడ, సిరు ల్త్రాలంగ, ఋణముల్ పై యాడఁగా బ్రాహ్మణ
ప్రభుల్ పుచ్చిన చెట్టులంబలె నశింపంజొచ్చి రత్యంతముః!

బ్రాహ్మణ సంస్థానములకే కాదు; బ్రాహ్మణ జాతికే శని గాఁడు పండ్రెండింటఁ బ్రవేశించినాఁడు!

సీ. చెప్పినట్టులు నడచిన కాలమున కర్త
వారి కుండ య్యెను బ్రాహ్మణుండు
నిన్నటిదనుక మన్నించిన దొరలకు
ప్రాణగోష్ఠం బయ్యె బ్రాహ్మణుండు
ప్రేమతోఁ బూజ సల్పిన శూద్రజాతికి
పల్లేరు ముల్లయ్యె బ్రాహ్మణుండు
మొదటినుండియు స్వాస్థ్యముగ నున్న యుద్యోగ
పదవికి పిడుగయ్యె బ్రాహ్మణుండు

నేర్చి సకలకళలు నేర్పి లోకుల కవి
బ్రహ్మదేవుఁ డనఁగఁ బరఁగి నట్టి!
బ్రాహ్మణుండు నేఁడు బాపనోఁడయ్యెను!
కాలమహిమ కాక కత మిఁ కేమి!

అయినను, దీని కన్యాల ననవలసిన పని లేదు.

సీ. ముష్టినుసులు పండి ముంగిళ్ళు నిండించు
మళ్ళు మాన్యములు కవుళ్ళ కిచ్చి
తోటలుం దొడ్లు మస్తుగ తాకట్టులు పెట్టి
పెళ్ళైన నిండ్లఁ బెండ్లిళ్ళొనర్చి
కొంపలుం గోడలుఁ దెంపుమై తెగనమ్మి
రోండ్లఁ గొలంది వ్యాజ్యములఁ జొచ్చి
పుస్తెలుం బూసలుఁ బుఃశికి కస్పుల కిచ్చి
పుత్రులం బెర చదువులకుఁ బుచ్చి
సౌఖ్యముల కాకరము లైన స్వస్థలములు
వీడి, పొరుగూళ్ళ బానిసవృత్తి నమరి
తమదు వ్రేల్పెట్టి తమకన్ను తామె పొడుచు
కొనుచున్నారు బ్రాహ్మణకులమువారు?

(కొంచెము నడచి) ఈ కాగితములపై సంతకముల చేయించుట కీపూఁట నైన సమయము చిక్కునో లేదో! అడుగో సిపాయి చిన్నయ్య బయటనే యున్నాఁడు. (పరిక్రమించి) చిన్నయ్యా! బాబుగా రేమి చేయుచున్నారు? ఏ మంటివి? "బాబుగారును శర్మగారును గలిసి బయటి కెక్కడికో వెళ్ళినా"రనియా? ఇదివర కెన్నఁడుఁ జీకటి పడిన వెనుక నిల్లు కదలు నాచారము లేదే! కొంపతీసి క్రొత్తనాటకమే దేని ప్రారంభము కాలేదుగద! సరే, కానిమ్ము సాహీబులవల్ల సంగతి తెలియకపోదుగదా! (అని నిష్క్రమించును.)

---

# రెండవరంగము

ప్రదేశము — కస్తూరి గది.

ప్రవేశము:— రఘునాధరావుగారు, శర్మ, వెంకటేశము.

వెంక — అయ్యా, దయచెయ్యండి. యియిగో కుర్చీలు. (ప్రక్కకుఁ జూచి) అక్కయ్యా! అయ్యగారు దయచేశారు. ఆలశ్యం చేశావంటే ఆగ్రహం వొస్తుందిసుమా! బాబూ! మా అక్కయ్యకు! మా సిగ్గండి. మా సంగతి మేంచెప్పుకో కూడదు కానీండి! మం చోరుకనక మనవిచేస్తున్నాను. ఆటకేం; పాటకేం; అందానికేం చందానికేం; సరసానికేం, సల్లాపానికేం; మా అక్కయ్యవాటి చెయ్యి మనజిల్లాలో లేదండి! కళాయిసేత్రంవంటా కంటో పాటం వండి. మొనపై నాలుగు రకాలూ యేకబిగిని నడుపు తుండండీ. కోనసీవకు మేళం వెళ్లా వంటే కోతుల్లాగ చుట్టుకుంటారు! పేరూర్లో, మాఅక్కయ్య యీాల్నపట్టి పెళ్లిమూర్తాలు పెట్టించు కుంటారు. సాధారణంగా వో పాటివారికి సరే అనేమనిషి కాదండి. తుని జమిందారుగారు కబురంపిస్తే త్రూ పొమ్మంది, విజేనగరం మహారాజుగారు పాట వినడాని కొస్తే, వీల్లేదు వెళ్ళమంది. అల్లాంటిది, తమ రొస్తున్నా రంటే, అంటుమామిడి పండులాగ తయా రయింది. చిన్న వాణ్ణయినా నా మాట చిత్తగిస్తా రని మనవి చేస్తున్నాను. సానుంచితే, విన్నారు బాబా సనే సానుంచాలి. కూటికి తగ్గా కూరా— సరసుడికి తగ్గా సానీ సమకూడ్డం మా కష్టం. (మరలప్రక్కకుఁజూచి) ఏమక్కయ్యా రావేం? నువ్వు రాలే దని బావయ్యగారు నుంచునే వున్నారు.

కస్తూ— (ముస్తాబుతో, తళుక్కునఁ బ్రవేశించి) అయ్యా! దండములు.

రఘు— (తనలో) ఓహో! యేమి సౌందర్యము.

ఉ. ఆ కురు లేమి! ముంగురుల నందపు నాసిక లేమి! వీనులన్
దేకువ దాకొనం గొనలు తీరిన యా కనుదమ్ము లేమి! పూ

పట్టిన గంపచందమున శోభిలు నా నునుచెక్కు లేమి! యహా
హా! తనువిట్లు నేడు గదరా! చరితార్థము నొందె నెంతయున్
నీవి లావణ్యము తిలకించుటకుఁగూడ శక్యము గాకున్నదే!

ఉ. కన్నులతె చూచుతమున్నఁ బమకంబునఁ బెట్టుల వ్రాలిలుఁజూప్పు! లం
దున్నను మేలె యున్నొక్కనిన నుండక, ఫాలముమీఁద సోలు! నం
దున్నను జాలు నన్నొక్కనిన నుండక. నా గౌరవంకఁ దూలు! నీ
యున్నులనిన్న! జూడ పశమా యిరుకన్నులవాని కొక్కటన్!

శర్మ (తనలో) నిజముగా, నీనిగుమ్మముతో గుక్కనైపుట్టిననుజాలును!

ఉ. ఎంతటు లేదు సాను లిది యేమి తపం బొనరించి పుట్టెనో!
కుందన మా శరీరమునకుం దిగనుక్కున కేని మాఱునే!
చందురుఁ బ్రా మొగంబునకుఁ జాకిరి సేయుటకైన నర్హుఁడే
పొందిన నిట్టిదానిఁ గన పొందవలెం దల యిచ్చి యేనియున్!

వెంక—(కస్తూరి వెనుక నిలచి, మెల్లగా) కొంచెం ముందు కెళ్ళ వమ్మా! దీపం మొహంమీద కానేటట్టు తిరిగి నుంచో, పయిట కాస్త పక్కకు జారనీ! కంగారు పడితే కార్యం లేదు! పోరన చుక్కా నన్నాడు! కూచున్న పాళాన్ని గుమ్మైపోవాలి! అబ్బా!— నే నాడదా న్నయితేనా!—

కస్తూరి—(మెల్లగా) సరే కాని— నీ వీక నెప్పి సాహేబుసంగతిచూడు.

వెంక—అదెంతపని కానీ బాగింది చుక్క నోటికి తగిలి పదిరోజు లయింది. నాలుగుబుడ్లు ఖర్చం చెయ్యక నావంతు నాకుంచు! (అని నిష్క్రమించును)

శర్మ—వెంకటేశ మేమిటి వెనుకనుండి గొణుగుచున్నాఁడు?

కస్తూరి—మరేమియు లేదు—అయ్యగారట్లు నిలుచుండియే యున్నారు— కూర్చుండుడనవే యని నన్నుఁ గూకలు వేసినాఁడు. వారికిఁ దగిన కుర్చీ వేయలేకపోతిని గదా యని వాక్కు రాక నేను జూచుచున్నాను. అయినను, కొండంత దేవరకుఁగొండంతపత్రి తేఁగలవారుందురు గదా?— వారి చిత్తము, నా భాగ్యము.

శర్మ—మాబాబుగారి మత మెఱుఁగక నీవట్లు నిష్ప్రశ్నములు చున్నావు.
ఇంత నిగర్వ చూడాము;లు, ఇంత రసికాగ్రేసరులు లేరనుకో.
కస్తూ—ఆసంగతి యనుభవము గాఁదఁగాని బోధపడునదికాదు.
రఘు—(తనలో) అచ్చా! అందముగా వేసినదిముక్క! (కూర్చుండును)
శర్మ—కాపిటల్! నీ షో టిప్పాడైన నివారణమైనదా?
కస్తూ—ఒకసాక్ష్యము సాక్ష్యమా? ఇంకొకటిమైనజూడవలెను.
శర్మ—అట్లయిన, నదికూడ కానిమ్ము.
కస్తూ—చిత్తము-చిటికలో వచ్చెదను. (అని నిష్క్రమించును)
శర్మ—(ప్రక్క-కుర్చీలోఁగూర్చుండి) ఏమి బాబూ-ఎట్లున్నదికస్తూరి?
రఘు—ఎట్లుండవలెనో యట్లున్నది?

గీ. పసిఁడిబొమ్మ చైతన్యము పడసినట్లు
మానికము ముద్దుగుమ్మగా మాఱినట్లు
మించు స్త్రీ రూపమును ధరియించినట్లు
నాదు కనులకుఁ దోచె నీ నాతి సఖుఁడ!

శర్మ—ఈయింట నింకొక విశేషము-విటుల నమాంతముగా విఱుచుకొని తిను వేయినోళ్ళ వేశ్యమాతాపిశాచ మొకటి లేదు!

గీ. అన్నమున వెంట్రుకయు; సున్నమందు ఱాయి;
పానకములోనఁ బల్లియు, పాలఁ జీమ;
సానియింటను దల్లి మంచమున నల్లి-
సర్వసామాన్యముగఁ దటస్థంబు లగును!

రఘు—వినలేదు. వేంకటేశము వేయిమంది వేశ్యమాతలపెట్టు
కస్తూ—(బ్రాంది, సోడాబుడ్లు తెచ్చి బల్లపైనుంచి, మరల వెళ్ళును)
రఘు—(వెఱగుపాటుతో) సరి కాని-యీ సన్నాహమేమిటి! దీనికి దివ్యదృష్టి కూడఁ గలదా యేమిటి!
శర్మ—తక్కినసానులకును దీనికినిగల తారతమ్యమిదిగో యిదియే.

ఆ. ఎదుటివారి చిత్తమెట్లొయట్టె యెఱుంగు
నచ్చెనేని ప్రాణ మిచ్చివేయు

పకునె కోరి నమ్మి పడియుండు నొక్కని
త్రోసె దీనినంటి సాని కలదె!

రఘు: ఇంటిమొద్దఁ బూర్తిగాఁ బుచ్చుకొనికూడ వచ్చితిమి కదా—
ఇప్పుడు మనము చేయవలసిన దేమిటి?

శర్మ—గాజులచేతులతో నడిమి యందించు గ్లాసులు గబగబ త్రైకొని—
గడగడ నోటఁ బోసికొనుటయే అన్యథా యొనర్చిన నాముండ
చిన్న బుచ్చుకొనదా? అది గాక—అర్నాల్డే మన్నాఁడు?—
* వెల్, ఐడోన్టు కేర్ యిఫ్ ఐ పార్టేక్
జస్టు ఫర్ మానర్సు అండ్ పొలైట్ నెస్ సేక్
అన్నాఁడు. ఆపాలిసియే(Policy) మనకథార్టీ (Authority)

కస్తూ—(పళ్ళెరములో భక్ష్యములును, గ్లాసులును దెచ్చిబల్లపైనుంచి యొక సోడాబుడ్డి కొట్టి రెండుగ్లాసులలోఁ బోసి, బ్రాందితో నా రెండుగ్లాసులు నింపి, యొకగ్లాసుతో రఘునాథరావుగారిని సమీపించి) చేతి కీయనా?—నోటి కీయనా?

శర—కాపిటల్! ఆముక్కకు మందాన్సర్ (Answer) చెప్పండి!

రఘు—మాకుఁ గావలసినది గానరసము కాని మధురసము కాదు.

కస్తూ—చిత్తము. కాని, కామశాస్త్రవిధ మది కాదు. మొదట సుధా రసము—పిదప గాన రసము—పిమ్మట నధర రసము.

శర్మ—హియర్! హియర్! ఇప్పుడు చెప్పుడు సమాధానము.

రఘు—ఇఁక నిదియె యిదే సమాధానము! (అనియందుకొని త్రాగును)

కస్తూ—(రెండవగ్లాసు నెత్తి) నాకుఁ గుడిచేతులు రెండు లేనందున, మీకు వెనుక నీయవలసి వచ్చినది. (అని శర్మ కిచ్చును.)

శర్మ—నాకు ముందు వెనుకలతోఁ బని లేదు. నాలుగు చుక్క లెక్కుడుగాఁ బడుట ప్రధానము. (అని త్రాగును.)

కస్తూ—(చిన్న పళ్ళెరములోఁ గొన్ని భక్ష్యములం బట్టుకొని) తమ చేతులకు చమురంటు నేమో—నేను దినిపింతునా?

*Well I dont care if I partake just for manners and politeness sake

రఘు—ఏమిటవి?-సరిసరి తెలిసినది. మాచమునఁతరఅకు రాలేము,

కస్తూ—అబ్బే. అదేమిన్యాయము?. దక్షిణ లేని దానము శ్రుతి లేని గానము, నంజుడు లేని పానమునా?

రఘు—అది కాదు. నామాట విను. ఆకంపు నేను భరింపలేను!

కస్తూ—గసగసా మసాలాతో కమ్మగా వేఁగిన కైమాలడ్లాలుకంపా? మంచిది, మీామాట యటుండనింము, (శర్మతో) మీారో?

శర్మ—నామాట యడుగవలెనా? సర్వభక్షకుఁడును నేనును సనదై యన్నదమ్ములము (అని మెక్కుచు) హాయి! హాయి! ఫ్రెంచి వారి పరేషన్సు French Preparations) వీనిమీఁద బలాదూరు!

కస్తూ—(మరలగ్లాసు నింపి) ఇదిగో-యీాసారినోటి కిచ్చెద.

రఘు—ఇప్పుడేగా యైనది? మరల నింతలోనేనా !

కస్తూ—అయ్యో నాయిల్లు బంగారము గాను!. అఘనపానమునకును మద్యపానమునకును హద్దేమిటి! (అని నోటి కీయబోవును )

రఘు—ఇటిమ్ము (అని యందుకొని, కొంచెము కొంచెము త్రాగును)

కస్తూ—(రెండవగ్లాసునింపి) ఇదిగో మీా గ్లాసు. (అని శర్మ కిచ్చి రహస్యముగా) మీారు వెళ్ళి యామిద్దెగదిలోఁగూర్చుండుఁడు. మీాకుఁగావలసినవన్నియు నచ్చట నుంచినాను. ఈయననిచ్చట త్రోకొట్టి, మీాయొద్దకు వచ్చెదను.

శర్మ—(బ్రాందినోటఁబోసికొని లేచి) ఇక్కడ నాకేమో యుక్కగా నున్నది. ఒకసారి పెరటిలోకేఁగి యొడ లార్చుకొని వచ్చెద. (అని నిష్క్రమించును.)

కస్తూ—(బాందిసీసా యెత్తి) ఇదిగో యిఁక రవంత పోయనింపు.

రఘు—నో నో! యిక వలదు. ఇక్కడికే యెక్కువైనది!

కస్తూ—నాలుగు చుక్కలు. నన్ను చంపుకొని తిన్నట్టే. నా మనవి వినక తప్పదు! (అని బలవంతముగా గ్లాసునిండపోయును.)

రఘు—(గడ గడ త్రాగివేసి, గ్లాసు క్రిందఁబాఱవేయును )

కస్తూ—మీాకుఁగూడ నుక్కగా నున్నదేమో! వినరుదునా?

రఘు—(మైకముతో) విషుర్దునా అంటావా? విషి‌ర్తే- వి- షి- ర్తే- విష్కీ- మంచిదా-షాంపేను మంచిదా-అని-విశ్వనాథం నేనూ తగువు పడ్డాం! తెల్సిందా? విష్కీ- మంచిదంటాడు విశ్వనాథం-షాంపెయిను మంచి దంటాడు పెర్మ-నువ్వే మంటావు?

కస్తూ—(తనలో) అయ్యగారి కందుకొన్నది ఈ యుండలు తినిపించుట కిదే సమయము. (ఉండలు చేతఁగొని, చటాలున నోడిలో గూర్చుండి) నామాట విన్నచో-మీమాటకుత్తరము చెప్పెద-

రఘు—ఓ! వింటా! పెళ్ళికొడుకు విన్నట్టు వింటా! పెయ్యి మీఁద వెయ్యమంటే వేస్తా! (అట్లుచేసి) పెక్కిలి ముద్దు పెట్టుకో మంటే పట్టుకుంటా! ఇదుగో-పెట్టుకున్నా! (అని యటు ముద్దు పెట్టుకొని) ఈసారి ఫెప్పు.

కస్తూ—నేను గన్నులు మూసినచో, మీరు నోరు తెఱవఁ గలరా? ఏదీ చూతము-(అని యెడమచేత నతని కన్నులు మూయును.)

రఘు—ఓ! ఒక్క దెబ్బకు! తెఱవనా? ఇదుగో (అని నోరు తెఱచును.)

కస్తూ—(కైమాయుండ నోట కుక్కి, నోరు మూసి పట్టుకొనును.)

రఘు—తెలిపింది! తెలపింది! హాబ్బా! కంపు! కంపు! హాక్!

కస్తూ—నాతోడు-నన్ను చంపుకొని తిన్నట్టే! కసబిస నములితిరా-కమ్మని వాసన బయలుదేరును. (అనుచు నోటికి చేయి యడ్డుపెట్టును.)

రఘు—(కొంచెము నమలి) ఔ నౌను-అనుకొన్నంత కంపు లేదు!

కస్తూ—ఈసారి చూడుఁడు! (అని యింకొకయుండ నోటవేయును.)

రఘు (ఇష్టముతో నమలుచు) నిజమే-నిజమే! ఈసారి గారిముక్క కంటె కమ్మగావుంది! ఏదీ-యింకోటందుకో!

కస్తూ—అదిగో-అదీ అందము! (అని పళ్ళెరము చేతిప్రక్క నుంచును.)

రఘు—(ఉండలు మెక్కుచు) అన్నట్లు, నీ వేమీ పుచ్చుకోలే దేమీ?

కస్తూ—నాకొక వ్రతమున్నది. ఎవరైన గ్లాసునింపి యందింపవలెను.

రఘు—అయితే, నే నందిస్తా! (అని గ్లాసునింపి, నోటి కిచ్చును.)

కస్తూరి—ముందుమీరు కొంచెముపుచ్చుకొని, శేషమునాకీయవలెను.

రఘు——షెబాష్!-అది షోకు! (అని యట్లు చేయును.)

కస్తూ——ఈసారివంతు నాది. (అని గ్లాసు నింపి, కొంచెము త్రాగి అతనినోటి కీయఁబోయి) ఏమిటి యాలోచించుచున్నారు? ఎంగిలి యనియా?

గీ. బ్రాంది సారాలకును, పానపాత్రిములకు
బిత్తరుల మోవులకును, కాఫీ హోటేళ్ళ
చిప్పలకు, బూటకూళ్ళింట్ల చెంబులకును-
నెంగిలియు; నెగ్గు నను న వెందేని గలవె!

రఘు——ఎవడన్నాడు ఉన్నాయని, ఎవడైనా ఉన్నా యంటే ఏడ్పు పొమ్మందాం! ఆ! (అనినోరు తెఱచి, నోటఁబోయగా మ్రింగును.

కస్తూ——నా కిప్పుడు నచ్చినారు! ఇంతటినుండి యీశరీరం మీ

రఘు——నీ షెరీరం నా డైటే-నా షెరీరం నీడి! నా ప్రాణం నీడి! నా మొన్నేటు నీడి! నా గుణ్ణాల్నినీ! నాకుకల్లీన్ని-నా-వ-నీన్ని-నీ

కస్తూ——మిగిలినవానిమాట కేమి కాని-మీ శరీరము నా దన్నారు గదా-మీశరీరమునం దున్నవికూడ నా వేనా?

రఘు——ఓ! షర్వం నీవేనీవే షర్వం-షర్వానికీ నీకూ షాంపేను ఫస్ట

కస్తూ——అట్లయిన, మీ వ్రేలి యుంగర మొకటినా వ్రేల నిడుకొననా

రఘు——అన్ డౌటెడ్లీ! (Undoubtedly) ఇదుగో యిడీ రవ్వ-ఇ కెంపు- ఇది పచ్చ-ఇదినీళం. ఇందులో నీకిష్టమయింది తీసుకో

కస్తూ——(చూచి) అన్నియు నాకన్నుల కంటకుగానే యున్నవి ఇం దేది తీసికొనను!

రఘు——అయితే, అన్ని తీసుకో! (అని యన్నియుఁ దీసి యిచ్చును

కస్తూ——(వ్రేళ్ళ నుంచుకొని) ఈసారి యీ యుంగరముల చేతితో నిచ్చునది పుచ్చుకొని చూడుఁడు! (అని గ్లాసు నింపి త్రాగించుచుండఁగా తెరఁపడును.)

ఇది చతుర్థాంకము.




# పంచమాంకము

## మొదటిరంగము

ప్రదేశము:—రాజవీధి.

సంగఁడు—(మధుపానమత్తతచేఁ దూలుచుఁ బాడుచు, బ్రవేశించి)

సుక్కా! నీ బొడ్డుపొక్క! సురుకు సెయ్యవే!—రమ్మొ—సుక్కా—
కక్క—ముక్కా, నీసుముక్కా,—కాల్చి పెడతానే—రమ్మొ—సుక్కా—!
ఇరుగు పొరుగు నవ్వనీ— ఊరువాళ్ళు తిట్టనీ
పరుగు పరుగూ వొచ్చి నీకు—పాల బడతానే—రమ్మొ సుక్కా!
పిల్లా జెల్లా మాడనీ— పెళ్ళాం దెబ్బ లాడనీ
కల్లుకిందా నీకిందా—కర్సుపెడతానే— రమ్మొ సుక్కా!
ముక్కూ మూతి పగల్నీ — ముంగలిపళ్ళూ రాల్నీ
తొక్క ఊడీ పోయిందాకా — దొర్లుతానే — రమ్మొ — సుక్కా!

(చరాలునఁ దిరిగి చూచి) ఎవడానవ్వేవాడు! నన్ను జూసి. నవ్వేవోడు నా మీడనుంచి బలాదూరు! తాగినందుకు నవ్వా రంటే—దవడపళ్ళు రాల్తాయి! కులాసా కోసం గుడ్డెడూ — జో క్కోసం బోతెడూ—దర్జా కోసం తవ్వెడూ — తాగితేమాత్తరం తప్పేంవిటి? ఎవడుతాగనోడు? నా తాత తాగాడు— నాటండ్రి తాగాడు! నీ తాత తాక్కపోతే నిలువునా కొరకెయ్యన్. తెల్సిందా? నీటండ్రీ తాక్కపోతే — నిడదోలుసుడుగులో పూడ్సెయ్యి! మళ్ళీ మాట్టాడావంటే మరామేకు! ఆగు! ఆపాట్నాగు! దగ్గిరి కొచ్చావంటే తన్తా! పాగదీసి టన్నానంటే— పాకిలేవులో మెల్లిపడాలి! అయితే, కాసుకో మరి! అప్పా! యిడుగోటన్ను!

(అనియెదుట నెవరో యున్నట్లు తన్నుఁబోయి, వెలకిలఁ బడి) కా లేదు- పిత్తు కా లేదు! కావలిస్టే యీపు పూసుకో!కూరుంటే కుక్కపిల్ల- లెగిస్టే లేడిపిల్ల - కాదన్నావోడు గాడ్దిపిల్ల ఇదుగో- లేస్టున్నా- లేశా! (అని లేవబోయి మరలఁ గూలఁబడి) బలే! పట్టికొట్టేయిలా కొట్టాలి! పైల్మాన్నోళ్ళంతా - నామీద నుంచి బలాదూరు!దీనిమీదింకోడ్రాం పడితే- దివిటీలా వెలిగా నన్నమాశే! (అని యెట్లో లేచి)

ట్రియ్యాని మాఁవిడి పండూ్రి పండూ్రి-
ట్రినబోతేడారకాదు - ట్రీపూలు మెంగూ్రి ॥ట్రియ్యా॥

ట్రీపులు మెందు్రి - ట్రీపూలు మెందు! ఎందుకో వుంద ట్రీపి? చెప్పకుంటే-పేరుసారాపెజెంటు! మాఁవిడి పండు ట్రీ పన్నావోడు-మాదిగాడి కొడుకు! ఇష్టఁవొచ్చినంత ట్రీపియీత కల్లులో వుంది! టాటికల్లు-టల్లి:యీటకల్లు-పెళ్ళాం! ఇహిహిహీ! ఇహిహిహిహి! ఇహిహిహిహిహీ! ఈటకల్లు టాగే-యిందురుడు- పెందురు డయ్యాడు! ఈటకల్లుటాగే - యిష్టామిత్తురుడు-యీరబద్దురుడయ్యాడు! ఇహిహిహీ! ఇహిహిహిహీ!

ఇప్పు డెల్లి టాగుటాను - యీట కల్లు,
తరవా తెల్లి టాగుటాను - తాటి కల్లు;
పగ లెల్లి టాగుటాను - పట్టసారా.
రాతి రెల్లి టాగుటాను - రమ్ముసారా

(చరాలున బ్రిక్కకుఁ జూచి) ఎవడా యెక్కిరించేవోడు! ఎక్కిరించినోడి గుండె మీద - యెగిరితన్తా! కైదులో కొచ్చాననా-కళ్ళుమిడకరిస్తున్నావు? కన్నుఁవేశెల్లానా - కైదులోకి? టాగడానికి డబ్బులివ్వకపోతే - టిలకాయ పగలే శెళ్ళాను! ఆ శెల్లుకూకుండి-హాయిగా తినొచ్చాను! మళ్లకొస్తాను - మళ్లీ యెల్తాను! పర్కారోడు పైల్లో సారాకూడా పోస్తే - పచ్చిందాకా పైల్లోనే వుంటాను!

అపనా – తన్నా – మన్నా మారోరి బైరన్నా ॥ అపనా॥
మారోరి బైరన్నా – మంచోడు బైరన్నా ॥అపనా॥
పెంతపెట్టూ పిగురుస్తూడు – పిన్నదాని పొగరు మాడు,
రాజమండ్రి యెల్లిస్తాడు – రమ్ము సారా త్రాగిస్తాడు॥అపనా॥

(ముందునకుఁ జూచి) ఎవడా వచ్చేవోడు?– పెర్మలా గున్నాడే?. ఆడే? ఆడే. బాబుగారి షామ్మంతా యీడు తెగ దినేస్తున్నాడు! ఈపూట కష్ట– యీడిదగ్గిరలాగాలి. కాషైపు పెద్దమనిషిలాగు కనబడతా! (శరీరము బిగఁబట్టినిలుచుండును.)

శర్మ –(ప్రవేశించి, జూచి, యులికిపాటుతో) ఇదిగో – యీ టెర్రిబిల్ ఫెలో (Terrible fellow) యెప్పుడో జైలులోనుండి దిగినాఁడే! మరల నూరిలో మరిడీదేవత ప్రవేశించిన దన్న మాటయే! ఈ రాస్కెల్ (Rascal) కంటఁ బడకుండ నీ పక్క సందునఁ బడి పోదునా? (ఆలోచించి) కాదు కాదు– ఇటువంటివాని కేమయిన చేపుచు, చేతిలో నుంచుకొనుటయే మంచిది. అవసరమైనచో – విశ్వాసరావు నొకసారి వీనిచే నుతికింపను వచ్చును (అని నడచును)

రంగ—దణ్ణాలండి బాబూ దణ్ణాలు! తఁవరి కోసఁవే షూస్తున్నా!

శర్మ—ఇదిగో. వచ్చినావా? యీమధ్య నీవు లేక యూ రంతయు జిన్నబోయినది !

రంగ—పిత్తం పిత్తం! రంగడిసంగతి మీరు కనిపెట్టారు! మీపాడాలు పట్టుకుంటే పాపాలు పోతాయి (అని పాదములపైఁబడును.)

శర్మ—పోయినవి. నీ పాపము లన్నియు పోయినవి. లెమ్ము.

రంగ—నే లేవను!. ఈపూఁట కష్ట మీ రివ్వాలి. నే లేవాలి!

శర్మ— ఇంతే గద?. ఈపూఁటనే కాదు. ఇది మొదలు నీకు లేనప్పు డెల్ల యిచ్చెదను ఇఁక లేచి, నాతో రమ్ము.

రంగ—(లేచి) వో–అల్లాగయితే. మీఆడ్డరు పెకారం నడుస్తా! మీరు తిట్ట మన్నోళ్ళని తిడ్తా. మీరు కొట్ట మన్నోళ్ళని కొడ్తా! (అని వెంబడింపఁగా, ఇరువురు నిష్క్రమింతురు.)

# రెండవరంగము

ప్రదేశము:—రఘునాథరావుగారి మేడమీఁది చావడి.

రఘు—(ఒంటరిగాఁ గూరుచుండి) ఎంత దుర్దినమో కాని, నేఁ డెచ్చటను బదులే పుట్టినదికాదు! నాయనగారి నవరత్న మాలిక యుండఁబట్టి తాకట్టునకుఁబంపి, ధైర్యముతోఁ గూర్చుం డుట కవకాశము చిక్కినది. శర్మ వెళ్ళి చాలసే పయినది, ఇంతసేపేమి చేయుచున్నాఁడు చెపుమా! ఒంటిపాటుకంటె నోపరాని దింకొకటి లేదు గదా!

గీ. చందురుని చుట్టు జ్యోత్స్నలపగిది మిత్రు
లెవని చుట్టును నుండ్రతడే కృతార్థుఁ,
డెవఁడు మరుభూమియందలి యొంటిమోడు
కరణి నొంటరి యగు వాఁడె కష్టజీవి!

కాలక్షేపమునకుఁ గచ్చేరివంటిది మఱి లేదు! సంవత్సర ములు దానికడ క్షణములక్రిందఁ గడచిపోవును.

ఉ. పలికిన పారిజాతములు పమ్మినయట్లగు; వాలుచూపులన్
జిలికిన క్రొమ్మెఱుంగులను జిమ్మినయట్లగు; నీటు వాటిలన్
గులికిన బూవుటమ్ములను గుమ్మినయట్లగు, డాయవచ్చినన్
గలకలలాడుచుం దినము కామినియై చనుదెంచి నట్లగున్.

(వినుట నభినయించి అడుగో శర్మ వచ్చుచున్నాఁడు)

(అనిచూచి, యంతలోఁ దెల్లపోయి) అయ్యో దేవుఁడా! శర్మ కాఁడు. విశ్వాసరావుగారు. ఈయన కొంటిగాఁ గంటఁ బడ కుండ నిక్కడి కెన్నిదినముల నుండియో కాలము గడుపుకొని వచ్చినాను. ఈ పూఁట నికఁ బట్టువడక తప్పదు. ఔరా! అంతచనువుగల విశ్వాసరావుగారి కెంతభయపడవలసి వచ్చినది!

సీ. బడి మాని తిరుగు తుందుడుకు విద్యార్థికి
తన యయ్యవారి దర్శనము వోలె

కనన్నంబు నైచిపో నున్నట్టి దొంగకు
  పోలీసువాని దాపురము వోలె
కుడువక ముడువక కూర్చెడు లోభికి
  రాటించు గురువుల రాక వోలె
మిండత నైపాన్గు మీారిన చెడిపెకు
  నాథుని సన్నిధానంబు వోలె
తప్పుదారులు మరగి స్వాతంత్రవృత్తి
మసలఁ గోరెడు వారికి మాన్యజనుల
సంగతి సమస్త విధముల జంకుఁ, గొంకుఁ
గించయు, ననహ్యమును గలిగించుఁ గాదె!

విశ్వా—(ప్రవేశించి, తనలో) ఓహో! బాబుగా రొంటరిగానె యున్నారే! ఔరా మద్యవిష మీాయన నెంతగా మార్చివేసినది!

సీ. నిండు జాబిల్లి ని నిరసించు నెమ్మొము
  కళగని, తోమని కంచ మయ్యె!
తమ్మిరేకుల తలఁ దన్ను కన్నులు
  గరిసిపోయిన గాజుగరిటె లయ్యె!
పసిఁడి యద్దంబుల భంగించు చెక్కులు
  కుట్టు లూడిన చెప్పు టట్ట లయ్యె
చిగురాకు సొంపులఁ జిన్నబుచ్చెడు మోవి
  తడియారిపోయిన వడియ మయ్యె!
చూడ ముచ్చట గొలిపెడు సొబగుమేను
వాడిపోయిన లే జొన్నకాడ యయ్యె!
శివుని గళ మెుక్కటియె నల్లు చేసినట్టి
కాలకూటంబు సురకన్న మేలు కాదె!

రఘు—రండు మామగారు! రండు! ఏమిటి విశేషములు?

విశ్వా—బాబు! ప్రత్యేకము చెప్పదగిన వేమియు లేవు. ముఖ్య విషయములు కొన్నిముచ్చటింపవలసివచ్చినాను (కూర్చుండును)

రఘు—ఆలాగుననా? అయ్యో నాకిప్పు డవకాశము లేదు గదా పదిమంది మిత్రులకీ పూఁట దోఁటలో బాలు. అతిశీఘ్రముగా నే నిపు డచ్చటి కేగవలసి యున్నది. మనము రేపు మాటాడు కొనఁ గూడదా?

విశ్వా—బాబు! తమ బాలుకంటె నిది తక్కువ విషయము కాదు. ఈయేఁటి కిస్తీ యింతవరకుఁ జెల్లింపనందున . . . ఇరువదినాలుగు గంటలలోఁ జెల్లించి తీరవలెనని ఈపూఁట నోటీసు వచ్చినది.

రఘు—ఇంతవఱ కేల చెల్లింప లేదు?

విశ్వా—సొమ్ము లేక.

రఘు—అదేమీ?. హాలుసాలు సిస్తులు వసూలు కాలేదా?

విశ్వా—వసూలైనవి వడ్డీల క్రిందను బిల్లుల క్రిందను వ్యయమును నయినవి.

రఘు—వడ్డీలు నిలువు సేయక పోతిరా?

విశ్వా—వడ్డీలు నిలువు చేసినచో వాయిదాలు గుజస్తుపడి, దండన షరతుల ననుసరించి సంతుగ లిచ్చుకొనవలసి రాదా?

రఘు—అట్లయిన, నే బాపిరెడ్డి యొద్దనో బదులు తీసికొనుచు.

విశ్వా—ఆ తారులాటయు నైనది ఎక్కడ ఎట్టిది యేగాని పుట్టలేదు!

రఘు—ఇదివరకుఁ బుట్టకున్న, నీ యిరువది నాలుగు గంటలలోఁ బుట్టఁ గూడదా?

విశ్వా—పుట్టకున్న, నిరుటివలెఁ బుక్కటి వరకును రాదా?

రఘు—అన్నట్టు నిరు డెట్లు చెల్లించితిమి?

విశ్వా—అయినమట్టున కొక గ్రామ మమ్మి చెల్లించితిమి.

రఘు—అట్లయిన, నీయేఁ డింకొక గ్రామ మమ్ముదము.

విశ్వా—(తనలో) హరహరా! ఆకారమే కాదు. బుద్ధికూడ బుగ్గియై పోయినది.

గీ. మద్యరస మను కార్చిచ్చు మానవుఁ డను
తరువునకు సోఁకినంతనే తత్తదవయ

వస్త్ర లనియెడి కొమ్మలు వమ్ముచేసి,
బుద్ధి యను చేవ-గోగూడ బుగ్గి సేయు!

రఘు—ఏమి మామగారు! ఏగ్రామము విక్రయింతము?

విశ్వా—బాబు! అందులకుఁ గూడ నిప్పుడవకాశము లేదు. ఏగ్రామమున కాగ్రామము తనఖాలలోఁ దల మునిగి యున్నది!

రఘు—అట్లయిన, మన మిపు డాచరింపవలసిన దేమిటి?

విశ్వా—అదేనా కేమియు బాలుపోక మీకడకు వచ్చినాను.

రఘు—అట్లయిన, నేనీరాత్రి యాలోచించి రేపు సాధనము చెప్పెద. ఈపూఁట కింతటితో నన్ను విడిచిపెట్టుఁడు.

విశ్వా—మఱియొక ముఖ్యవిషయమునుగూర్చి మనవి చేయవలసి యున్నది. వారముదినములలో, బయికవిూయుని రెండవ వ్యాజ్యె ము వేసెద నని వకీలయ్య నోటీసిచ్చినాఁడు.

రఘు ఇంకను నాతని కీయవలెనా? తీసికొన్న దెంత? తీర్చిన దెంత?

విశ్వా—తీసికొన్న దెంతయో కాని పత్రముతో నున్నది పదునాఱు వేలు. ఇప్పటికిచ్చినది పది వేలు. ఈయవలసినది రెండు వేలు.

రఘు—ఇంతేగద! ఈరాత్రి నేనుమాటాడెదలెండు. అకట్ట యేమిటి?

విశ్వా—ఇవి యీనాఁడు వచ్చిన బిల్లులు. ఇది కస్తూరి చీటి.

రఘు—కస్తూరి చీటి యే మని?

విశ్వా—వెంటనే వందరూపాయలు పంపు మని!

రఘు—పంపినారా?

విశ్వా—వందకానులైన లేనప్పుడు వందరూపాయ లెట్లు పంపగలను?

రఘు—ఏమీ? దివాణ మంత దీనదశలో నున్నదా?

విశ్వా—బాబు! యేను మనవి చేయను!

సే. ఎంత వ్యయించిన నెప్పటి కప్పుడె
పెరిఁగెడు దరి లేని సిరులతోడ
ఏవేళ వచ్చి పోయెడు కవి పండిత
బంధు మిత్ర ప్రజా ప్రతతితోడ

స్వజనంబునలె సర్వసౌఖ్యంబులం బాలు
గాంచెడు విద్యార్థిగణముఁ గోడ
పాళిణంబు లేని యర్పణ సేయ సమకట్టి
కొలిచెడు సేవకకోటిఁ గోడ
డంబు మీఱిన తమ దిమాణంబు నేఁడు
సర్వవిషయంబులందును సన్నగిల్లె!
అకట! మీరింక నైన సింహావలోక
నం బొనర్పనియెడల నాశంబె యొదవు!

రఘు—అట్లయిన, నందులకు నేఁ జేయవలసిన దేమో చెప్పరాదా?

విశ్వా—కస్తూరియింటఁ గాలు పెట్టకుండుట ప్రథమకర్తవ్యము.

రఘు—అయ్యయ్యో! పాప మదేమి చేసినది!

విశ్వా—అదేమి చేసిన దని కాదు. అదేమి చేయలేదని యాలకింపుడు!

ఉ. నిలువునఁ గల్లలుం, గరము నీచపుటూహలు, మేఱి యిచ్చకం
బులు బహుమాయలు న్వివిధమోసములుం దమ సొమ్ముగా విటా
వళులను దోచు వేశ్యతల వాకిటఁ గాలిడి, గుల్ల కానివాఁ
డిల నొకఁడేని, మచ్చునకునేని నిజంబుగఁ గానిపించునే?

రఘు—మామగారు! అందఱ నొకమూసికనే గొలుచుట న్యాయమా?
కస్తూరి యెల్ల వేశ్యలతోఁ గలిపి లెక్క పెట్టవలసినది కాదు.

గీ. తలఁపవె, విశ్వాస మన్నది దాని సొమ్ము
దయయు, సత్యంబు లనునవి దానిహక్కు—
లట్టి సద్గుణఖని వెలయాండ్రియందె
కాదు—కులకాంతలందును గానఁబడదు!

విశ్వా—బాబు! మీకే కాదు ప్రతివిటునకు నిదే వెఱ్ఱి! కాని.

కం. తెల్లని కాకియు, ముడుసుల
నొల్లని శునకంబుఁ, తీపు లొసఁగెడు వేముం
జల్లని నిప్పుం గలిగిన
సల్లలితగుణాఢ్య యైన సానియుఁ గలుగున్!

రఘు—అవునా? అట్లనన్నారు గనుక నా ప్రతిజ్ఞ వినుడు.

ఆ. ఎవ్వ రేని, యెన్నఁ డేనియు గస్తూరి
యెడల నించుకంత యెగ్గు నాకుఁ
జూపఁ గలిగిరేని సూనృతంబుగ నా తు
ణంబ దాని వీడనాడువాఁడ!

విశ్వా—(వినుట నభినయించి) బాబు! ఎవరో వచ్చుచున్నారు. ప్రస్తుతము నాకు సెలవు! దయచేసి తమ ప్రతిజ్ఞను మాత్రము పరాకు పడకుడు! (అని లేచి, యావలకు వచ్చి ప్రవేశించుచున్న శర్మను జూచి తనలో) నాయనా, నీవేనా, నీవుదాహరించిన తరువాతనే మా ప్రభువున కింత నీచదశ పట్టినది.

ఉ. బంగినపల్లి మామిడిని బోధమెయి న్విషముష్టి జేయు రీ
తిం గుణవంతు, సత్కులజు, సుదీర్ఘమనస్కుఁ, బ్రియావచస్కు, ని
బ్బంగి నితాంత హేయమధుపానపరాయణుఁగా నొనర్చి వా
రాంగనపంచకుం దిగిచి తౌర! క్రమంబుగఁ బాపచిత్తుఁడా!

కనుకనే ఖలమైత్రి కూడ దన్నారు. సందియమేమి?

ఉ. ఆడగవచ్చుఁ బన్నగచయంబులతో భయ ముజ్జగించి; ము
ద్దాడగవచ్చుఁ జిచ్చును సయంబుగ దోసిట సంగ్రహించి; వె
న్నాడగవచ్చు వ్యాఘ్రనివహంబులఁ బెంపు వహించి, యెన్నఁడుం
గూడగరాదు దుర్జనులఁ గూడిన ముప్పు ఘటిల్లి తీరెడున్!

(నిష్క్రమించును)

శర్మ—(ప్రవేశించి) అరరే! బాబుగారితో మాటాడుట కీ బ్లడీ ఫూలున కవకాశముండి పోయినదిగదా! ఎప్పు డేమి చెప్పి నాపై సేవగింపు కలిగించునో యనియెల్లప్పు డాయన నంటఁగాగియే యుందును. ఈపూఁటనే నాపనిమీద వెళ్ళుటచే ఈ డాంకీ (ConkeY) కవకాశము దొరికినది! అయిన నదేమి చిత్రమో. కాని, యీతనికడ నాయన యీశ్వరవేరు సోఁకిన పామువలె నగును! మగవానికి మగవాఁడు జడియుటకంటె మతిమాలినతన మేమున్నది! ఈవిషయమున నాకు నేనేసాటి.

చ. జడియగ లేదు చిన్నవృతు స్వాంతమునం బశిరొుజ్జ కైన్నఁడుఁగా
జడియగ లేదు తండ్రికిని సాఁకిన తల్లికి గూడ లేశముఁగా
జడియగ లేదు పెద్దలకు ఛాందసమూర్ఖులకైల్ల, యిప్పుడో
జడియను బ్రహ్మ కేనియు నిజంబుగ నాతని యబ్బ కేవియున్.

ఈతని కుద్యోగము చెప్పింపకున్నచో నా కిచట నేమము లేదు. అందులకై యనేకాలోచనలు సేయుచున్నాను. కాని మ్మ, చూతము. (ముందునకు నడచును.)

రఘు—ఇదిగో యిప్పటికా వచ్చితివి? నీవు లేక విశ్వాసరావుగారి చేతిలో నిమ్మకాయవలెఁ జిక్కు-వడ వలసి వచ్చినది!

శర్మ—అలాగునా! అట్లయిన నేదో విశేష మున్న దన్నమాటే

రఘు—కడమ విశేషముల కేమి గాని కస్తూరినిగూర్చి మా యిరు వురకును గావలసినంత గ్రంథము నడిచినది.

శర్మ—ఏ మని?

రఘు—కస్తూరికూడ కడమ వేశ్యలవంటిదే యని యాయన వాదము.

శర్మ—అంత ఫూలా మీ ఆల్ గాండు మానేడనుగారు! అందులకు మీ రే మన్నారు?

రఘు—కస్తూరి యెడ కాసింత లోప మెవ్వరైన జూడఁ గలిగినచో తత్క్షణమె విడిచిపెట్టెదనని డంకా గొట్టినట్లు చెప్పినాను.

శర్మ—కాపిటల్! ఆమాటతో ఆయన మాటిపోయి యుండవలెను!

రఘు—అదేమో నాకుఁ దెలియదు కాని, అంతలో నీవు వచ్చినం దున, ఆమాట పరాకుపడ వల దని నన్ను హెచ్చరించి లేచి చక్కఁబోయినారు.

శర్మ--(తనలో)అట్లయిన, నతఁ డేదో వంక చూపుటకు యత్నింపక మానఁడు. కాబట్టి, కస్తూరియు నేనును గాశింపు కన్ను తెఱచి కొనియుండుట మంచిది.

రఘు—అన్నట్లు నీవు వెళ్ళిన పని యేమయినది?

శర్మ—హోటలుమీఁద మీ సెలవు ప్రకారమైదువందలును దీసికొన్నాను. తోఁచిన సామగ్రి కొని కోటలోని కంపినాను. ఇదిగో యీనోటు మిగిలినది (అని యొక నోటు తీసి యిచ్చును.)

రఘు—(నోటు విప్పి చూచి) ఏమి— నూఱు రూపాయలవఱకును మిగిలినవిగా! ఈ చిత్రము చూచితివా?— యీనోటు నెంబరు ముప్పదిమూఁడు వేల మూఁడువందల ముప్పదిమూఁడు! అన్నియు మూఁడంకెలే!

శర్మ—అలాగునన్నా! నే నా సంగతి గమనింపనే లేదు!

రఘు—(నోటు బల్లపైనుంచి) అన్నట్టు కొన్న వేమేమిటో వినలేదు.

శర్మ—(జేబులోని జాబితా తీసి) ఇవిగో యివి: టెన్ విస్కీలు— ఫైవ్ షాంపెయినులు— సిక్సు షెర్రీలు— ఫోరు హాక్కులు, సెవెన్ క్లారెట్లు, ట్వెల్వ్ పోర్టులు, ఫోర్ జాగర్సు, త్రీ ఎక్షాలు, ఫార్టీ సోడాలు—ఫార్టీ లైమ్‌జ్యూసులు, ఫిఫ్టీన్ కోడిపెట్టలు, ఫైవ్ సేర్సు లేడిమాంసము, ఫైవ్ సేర్సు మేకమాంసము, ట్వెంటీ పెయిర్సు మేకకాళ్ళు, త్రీ సేర్సు పొట్టేలుమాంసము, హండ్రెడ్సు కోడిగుడ్లు రెండువీసెల రొయ్యపప్పు, ఆఱు చిన్నడబ్బాల యావునేయి, బిందెఁడు పాలు. రెండు టీ డబ్బాలు, రెండు కాఫీ డబ్బాలు, రెండు కోకో డబ్బాలు, సిక్స్టీ సిజరుసిగరెట్ల పెట్టెలు, నాలుగు చీట్లపేకలు, పై సంబారములతో పదిసేర్లు పలావు బియ్యము.

రఘు—సరి కాని, వంటకము లేమిటివి?

శర్మ—కోడిమాంసము పలావు, లేడిమాంసము కూరమా, మేకమాంసముపకోడీ. మేకకాళ్ళసూప్, పొట్టేలుమాంసము కైమా ఉండలు, కోడిగుడ్ల యట్లు, రొయ్యపప్పు వేపుడు.

రఘు—ఆఁగు! ఆఁగు! ఆయన మరల యెందులకో వచ్చుచున్నారు.

విశ్వా—(చర చర ప్రవేశించి) బాబుగారి పంతమే నెగ్గినది! అమ్మాయిగారు రేపూఁట నైదుగంటల రైలులో వచ్చుచున్నారు. ఇదిగో టెల్లిగ్రాం! (అని తంతివార్త ఇచ్చును.)

రఘు—(తదేకదృష్టితో తగరిశాస్త్ర ననలోకించును.)

విశ్వా—(రఘునాధరావు ముఖలక్షణములను జూచు చునిలుచుండును.)

శర్మ—(తనలో) ఎక్ ! యీ సమయమున నా నోటు సంగ్రహించి, యీతనిపై ననుమానము కలిగించి యీపూటనె తిలోదకము లిప్పించితినా, యిఁక నీతనింగూర్చి భయపడనలసిన పనియుండదు. (మెల్లగా నోటు సంగ్రహించి, లోపలి జేబులోనిడికొనును)

రఘు—సరే, యెవరు రానున్నను నాకు నా యెంగేజిమెంటు (Engagement) తప్పదు. రైలుకడకు మీరు వెళ్ళి తీసుకొనిరండు.

విశ్వా—చిత్తము (అని నిష్క్రమించును)

శర్మ—బాబు ! యెవరా వచ్చువారు !

రఘు—ఇంకెవరు, మా యింటియాబిడగారు ! కార్యమై మూడేండ్లయినది. కాఁపురమునకుఁ బంపుఁడని నే నడుగలేదు; నే నడుగలేదని వారు పంపలేదు ! చివరకాబిడకే శివమెత్తినది కాఁబోలు, తనంతఁ దానే దయచేయుచున్నది !

శర్మ—అన్నా ! యీమాట విన్న, కస్తూరి కడుపు పగిలి చచ్చునేమో గదా !

రఘు—అదేమి !

శర్మ—ఆముండకు మీపైఁగల యనురాగ మట్టిది. పది నిమిషములు మీ రగపడకున్న బ్రతుకఁ గలదా !

రఘు—వెఱ్ఱివాఁడా ! కస్తూరిని విడిచి నేనుమాత్రము గడియ తడయుఁగలనా ! ఈపూఁట నిప్పటి కిరువది సారులు జ్ఞప్తికి వచ్చినది. అన్నట్టు మఱచితిని. సొమ్ముకొఱకు విశ్వాసరావుగారికి కమ్మ వ్రాసినది, పైకము లేక యాయన పంపలేదు. ఇంతలో నీనోటు కొనిపోయి దాని కిచ్చి రమ్ము (అని బల్లమీద వెదకుచు) ఏది చెపుమా, యిందాఁకటి నోటు?

శర్మ—బల్లమీఁద నేగాఁ బడవేసినారు? (అని తానును వెదకును)

రఘు—(మీఁదను, గ్రిందను జూచి) ఏదీ, యెక్కడను లేదే !

శర్మ—ఎక్కడను లేకేమి? అంటుకొన్నవారియొద్ద పోయిగానుండును.

రఘు—విశ్వాసరావుగారు తప్ప వేరెవ్వరును రాన లేదే?

శర్మ—విశ్వాసరావుగారికి సొమ్మన్న విష మనియూ మీయూహా?

రఘు—శివశివా! యెంత చిన్నమాటాడితివి?

గీ. ధర్మదేవత ధర్మము తప్పవచ్చు
గ్రహము లాత్మీయగతులను గడవవచ్చు
వీసమంతయుఁగూడ విశ్వాసరావు
నీతిఁ దప్పఁడు సలుపఁడు నీచపుఁబని.

శర్మ—కావచ్చునుగాని - పైస్థితినిబట్టిలోపలిస్థితి నెఱుఁగుట కష్టము!

గీ. కదలి బాడబమును, మంచు గడ్డ వేఁడి,
జాతి శాటియయు, నల చేవమ్రాని బోలు,
పంటి విసమును, మఱి మేడిపంటి పురుగుఁ
దెలిసికొన శక్య మగునె పై స్థితిని బట్టి?

రఘు—నీ వెన్ని చెప్పిన నీవిషయమునందు నీతో నే నేకీభవింపఁ జాలను. ఆనోటు నెంబరు మన కెన్నఁటికిని మఱపునకువచ్చునది కాదు గదా?—ఎప్పుడో, యెచ్చటనో! యెట్లో, దాని కదియే బయటబడి—నిశ్చయముగానీ యభిప్రాయమున దేమార్పుఁ గలదు.

శర్మ (తనలో) ఇఁక లాభము లేదు! ఈ స్కీము (Scheme) ఫే లయినట్లే! ఆల్ రైట్ (Alright) కానిమ్ము! (పయికి) బాబు! మీ యభిప్రాయమును మార్చునో, నా యభిప్రాయమును మార్చునో మాత్రము చూడవలసియున్నది. అదిగో! నాలుగు! అయిదు నిమిషములలో మీరు డ్రెస్సు వేసికొనవలెను. నేను వెళ్ళి కారు గడపవద్దకు రప్పించెదను.

(ఇద్దఱు లేచుచుండఁగా తెర పడును.)

ఇది పంచమాంకము.




## షష్ఠాంకము.

ప్రదేశము:—రఘునాథరావుగారి మేడమీఁది పడకగది.

నిర్మల—(సర్వాలంకార శోభితయై గదిగుమ్మములో నిలుచుండి) ప్రాణేశ్వరుని మొగము చూచి పదిరోజులు తక్కువగా మూఁడేండ్లయినది! తల్లి లేకపోవుటచేతను, తండ్రిగారు పలుతిక్కవారగుటచేతను, భర్త పంతగొండియగుటచేతను గాకున్నసంత కాలము కన్నవారియింట నుండవలసి దాననా! తమయాజ్ఞనతిక్రమించి వచ్చినందులకై తండ్రిగారిక నాముఖము చూడరు! కాని, నేనొనర్చినది నాకర్తవ్యమె కాని మఱియొకటి కాదు.

చ. కనకముతోడ నున్నపుడె కాంతులనన్మణికిన్; మహీజముం
బెనగొనినప్పుడే లతకుఁ బెంపును, నింపును, సొంపు, వీణియం
దనరినయప్పుడే యినుపతంత్రులకున్ మధురస్వనంబు: స్త్రీ
జనమునకున్ నిజేశ్వరునిసన్నిధి నున్నపుడే సుఖోన్నతుల్.

జీవితేశ్వరుఁడు నారాకకుఁ జిరాకు పడునో—సంతోషమె పడునో తెలియకున్నది! ఇంతవఱకాయన యింటికి రాకుండుటంబట్టి నాహృదయము పలుసందియముల పాలగుచున్నది! (ఉలికిపడి) అమ్మయ్యా! అవిగో మేడమెట్లు చప్పుడగుచున్నవి! ఆయనయే యైయుందురు ॥ (గదిలోని కేగును.)

రఘు—(తూలుచుఁ బ్రవేశించి) మేడకు మెట్లు పెట్రినవాణ్ణి మెత్తగా ట్రిన్నినా పాపం లేదు! ఎందుకిన్ని మెట్లు—ఏడవనా, మొత్తుకోనా! ఏకమెట్టయితే యెగిరి పక్కా బొయ్యేవాణ్ణి!

దీ మోస్టు డర్టీ కింగ్ - వాకింగ్
దీ మోస్టు నాస్టీ కింగ్ - టాకింగ్
దీ మోస్టు లక్కీ కింగ్ - స్మోకింగ్
దీ మోస్టు ప్లక్కీ కింగ్ - డ్రింకింగ్

వహ్వా! వహ్వా! కస్తూరి యీపడ్డెంవించే, కాగలించుకోక పోయిందా! ఏదీ- మా వైఫ్ (Wife) గా రెక్క- దున్నట్టు! అడ్డుగో-ఆగడిలో పుంట్రూరు అమ్మవారి దరిషెనం చేసినట్టు- ఆవిడ దరిషెనం చేస్తాం! (గదికుమ్మము చేరి) హాల్లో - మై డియర్ యెంప్రెస్! (Hallo my dear Empress)హౌఅర్యూ (How are you) షుకంగా వచ్చినట్టా? (గదిలోఁ బ్రవేశించి భయముచే గవాక్షముకడకుఁ బోయి బల్లనానుకొని నిలుచున్న భార్యను ఎగాదిగఁ జూచి) ఎక్సెలెంటు (Excellent) యెంగ్రాం డుగా (Grand) తయారయ్యావు! మూడేండ్ల కుమూడదుగులు పెరిగావే! ఈబ్యూటీ (Beauty) అంటాపొంటఁవేనా యెరువా? పొంటఁ వైతే- షోగ్గానే వుంటావ్! నీమీద పద్దెం షెప్పనా?-

నీదు ఫేస్ కాంతు మూన్ - నీదు నోస్ గోల్డు స్పూన్
నీదు టీత్ పెరల్ లైక్ - నీదు లిప్ ఫ్రెంచి వైన్.

హ్వా! హ్వా! హ్వా! హ్వా! (అనిమూడి కుర్చీలోఁగూలబడును.)

నిర్మ—(తనలో) ఓయి దేవుఁడా! ఏమిఘోర మిది? ఈ వాలక మేమి- యీ వాగ్ధోరణీ యేమి! ఈయనకు పిచ్చి పట్టినదా- పిశాచము పట్టినదా! లేక నేను స్వప్నావస్థలో నున్నానా - సన్నిపాతా వస్థలో నున్నానా!

సీ. తళుకు నిగ్గులఁ దళదళలాడు నెమ్మొగ
మెట్లు లేగతి మాడురొట్టాయెయ్యో!
పరమదయారసభరితంబు లగు కన్ను
లెట్లు లేగతి నగ్గితుట్ట లయ్యో!

* The most dirty king—Walking—The most nasty king—Talking
The most lucky king—Smoking—The most plucky king—Drinking.

భారతీపతి కాటపట్టగు నాలుక
యెట్టు లీగతి గాటిపట్టె యయ్యో!
దిరిసెనపూవుమాదిరి నొప్పు సొబగు మే
నెట్టు లీగతి వంటకట్టె యయ్యో!
కరము మితభాషి యని పేరు గన్న సుకృతి
యెట్టు లిటు వస త్రాగిన పిట్ట యయ్యో!
ఆయనే యీయయనా?- లేక యాయ నొకరు
నీయ నొకరున! దైవమా యెఱుఁగ జెపుము!

రఘు—ఏఁవి టాలాపిస్తున్నావు? పద్యానికి బహుమతీ యేఁ విన్నా నవా? ఒక్క- ముద్దు! ఆ ముద్దు- మూడుకోట్లు పెయ్యాలి కస్తూరి ముద్దకన్న కమ్మగావుండాలి(లేచి సమీపింపఁబోవును

నిర్మ—(అసహ్యముతోఁ దనలో) రామ రామా? యీ దుర్వాసన యేమిటి! ముక్కు- ముణిగి-తల పగిలిపోవుచున్నదే! ఈ కిటికీ తెఱచినఁగాని-యిచ్చట నిలుచుట కష్టము(అని యటుతిరుగును)

రఘు—చీ! చీ! సిగ్గు పడుతున్నావా? అవు నవును. పెగ్గు తగిత్తే గాని- సిగ్గు పోదు! షెల్లేఁ వన్నాడు. స్పిరిట్టు తగిట్టేగాని- స్పిరిట్టు పుట్టదన్నాడు. దటిజ్ ట్రూ! (That is true) పెగ్గు టగలాలి- నీ సిగ్గు పిఁవడాలి! ఇదిగో - పెగ్గు నాడగ్గరే వుంది (అనుచు జేబులోని సీసా తీసి) వహ్వో! వహ్వో! యేఁవి స్వరూ పం! ఏఁవి స్వారస్యం! ఏఁవి సామర్థ్యం. అమృతమూ యిదీ అక్క- పెళ్ళిళ్ళు! ఆ యమృతం ట్రాగి-అదెటి(అదితి)కొడుకులు, దేవత లయ్యారు; ఈయమృతం ట్రాగి-భరతమాతకొడుకులు- పరంగి దొర్లవుతున్నారు. ముందు నేను కాస్తపుచ్చుకుంటానట- టర్వాత నీకు ట్రాగినం తిస్తానట. (సీసా యెత్తి త్రాగబోయి డామిట్ ! పడదేం ! హాల్లో ! వాట్యే ఫూల్గై యామ్! (Hallo what a foolgam!) కార్కు- నాట్ రిమూవ్డు (Cork not removed)సరి- మాకార్కుస్క్రూ- (Cork.screw)గాదెక్క-

డున్నారు? (అని జేబులోని తాళముచెవుల గుత్తి తీసి అందలి మరతీగతో కాయ్యను దొలగించి, త్రాగును.)

నిర్మ—(రిచ్చపాటుతోఁ దనలో) అమ్మయో! యిదా సంగతి సరే యిక నేమి! మా యింటియెదుటి మలయవలికి పట్టిన గతియే నాకును బట్టినది! దానినోట దానిపెనిమిటి చర్యలువిను నప్పుడు అంతఘోర ముండునా యనుకొనెడి దానను. సర్వేశ్వరుఁడు నా సందేహము తీర్చుటకుఁ గాఁబోలు నాదురవస్థనాకే యనుగ్రహించినాఁడు! ఔరా కాలమహిమ!

ఉ. పుట్టిన భూమియా ఋషులు పుట్టిన పావన భూమి; వంశమా-
పట్టు బుధాను మావ నిరవద్య చరిత్రము- తల్లిదండ్రులా-
నెట్టన ధర్మదేవతకు నెయ్యపుఁ జుట్టము: లక్కటక్కటా!
యిట్టినికృష్ట దుర్వ్యసన మీయన కేగతి నబ్బెనో గదా!

రఘు—(మతికొంచెము మత్తుతో) ఇదిగో- ఇడి నీవంటు! ఇడి పుకుకుని- అరుణామెలంలాగు- ఆ-డా-లి, పాపామెలంలాగు పా-ఢా-లి; మంజువాణిలాగుమా-ట్లా-డా-లి, పౌనాక్షిలాగు- పో-ట్లా-డాలి; నరహరిలాగు-నవ్వాలి, మొలనాగలాగు-యేడవాలి; కనికిలాగు-గ్లాసు లందిచాలి, కస్తూరిలాగు- కైనూవుండలు తినిపించాలి! తెలిసిందా! హుఁ!

నిర్మ—అమ్మయ్యో! అంతటితోఁ దీఱ లేదు!- పట్టవలసిన లక్షణము లన్నియుఁ బట్టినవి! అయిన నందుల కాశ్చర్యమే మున్నది!

ఆ. జ్వరము వెంటఁ జలియుఁ జలివెంటఁ దాపము
దానివెంట శోష దాపరిల్లు;
కడగి యన్విధంబు గానె దుర్వ్యసనంబు
లొక్కదానివెంట నొకటి యొదవు!

రఘు—షట్టు- పదిలంగా నేను నోట్లో పోస్తాను – పానకాలరాయుడు లాగు నువ్వు డిగమింగు! (అని సీసా నోటికందింపఁ బోయి, నిర్మల తప్పించుకొనఁగా) ఏఁవిటీ వెంకితనం. బుగ్గలు చిదిపి, బూర్లొండిపెడతా షూడు! (అని గిల్లబోయి, గోడపై, బడును.)

నిర్మల—(గద్గదస్వరముతో) మహానుభావా! నేనిప్పుడు మతి లేనిస్థితిలో నున్నాను! దయయుంచి నన్నిప్పుడు తాఁకఁబోకుఁడు!

రఘు—ఎందుకు పోయింది మటీ, ఎందు కంటా!

నిర్మ—ఎందుల కేమిటి!— పాలకడలికంటెఁ బరిశుద్ధమగు వంశమునందు బ్రభవించిన మీరిట్లు మధుసేవా పరాయణు లగునప్పుడు మతి యన్న మాట యేల— ప్రాణమే పోఁగలదు!

రఘు—నా న్సెన్సు! (Nonsense) మధుసేవ ట్రిపన్నవాఁడు మనిషే కాడు! ఎవడుటాగ్రనివాడు? ఎవడంటా! చెప్పవేఁ! ఎవ డంటా?

*సం డ్రింక్ హ్వెన్ ఫ్రెండ్సు స్టెప్ ఇన్
సం డ్రింక్ హ్వెన్ ఫ్రెండ్సు స్టెప్ ఔట్
సం డ్రింక్ బికాజ్ దే,ర్ థిన్
సం డ్రింక్ బికాజ్ దే,ర్ థిన్
సం డ్రింక్ బికాజ్ దే,ర్ స్టౌట్
సం డ్రింక్ బికాజ్ టీజ్ వెట్
సం డ్రింక్ బికాజ్ టీజ్ డ్రై.

ఇది దొర్ల సంగతి—ఇక మనసంగతి చెప్పనా!

* గీ. కొంద ఱాయాసము శమింపఁ గొందఱెల్ల
బాధలు భరింపఁ, గొందఱు బలముఁ బెంపఁ,
గొంద ఱుల్లాస ముదయింపఁ గొంద ఱెఱుఁటి
వారిఁ దనియింప— మద్యసే వఁ బొనర్తు!

తెలిపిందా?— కనుకా—కాబట్టీ—నీ హెల్తు (Health) కోసం నేను ట్రాగుటాను— నాహెల్తుకోసం నువ్వుట్రాగు! ఎల్లాగ ట్రాగడఁపంటావా?— యిల్లాగా! (అని సీసాలోనిది పూర్తిగా త్రాగి సుడి తిరుగుచు) సా—రీ—గా—మా—పా—డా—నీ—సా—సే—సా—సా—సా ట్రా—ట్రా—టా—ఁా—డీ—దూ—ఁా! ఢా! అని నేలఁగూలును)

---

Some drink when friends step in—Some drink when friends step out
Some drink because they are thin—Some driuk because they re | stout.
Some drink because tis Wet—Some drink because t'is Dry.

*ఈపద్యము ప్రదర్శనసమయమున సమయోచితముగాఁ జదువవలెను.

నిర్మ—(తత్తరపాటుతో) అయ్యో! అయ్యో! అదేమి — అట్లు పడిపోయినావు! ఎవరిపుడు దిక్కు! ఈనిశీథసమయమున నెవ్వరిని బిలువను! నేను పట్టి లేవనెత్తి పర్యంకముపైఁ బరుండఁ బెట్టఁ గలనా! కానిమ్ము — ప్రయత్నించి చూచెదను— (అని సమీపించి అంతలో వెనుకకు తగ్గి) ఇస్సీ! యీ చెడుకంపు నన్నుఁజెంతకుఁజేరనీయకున్నదే! ఇందుల కేమిటి సాధనము!— సాహసమే సాధనము! (ముక్కు మూసికొని సమీపించి, యెత్తబోయి, యెత్తలేక విడిచిపెట్టి) అయ్యో దేవుఁడా! యెత్తలేక పోయితిని గదా! అంతటి యాగర్భశ్రీమంతు లిట్లు — వడగొట్టిన బాటసారివలె, వాన మొత్తిన వెలిబొమ్మవలె; దరిఁ బట్టిన నావవలె, దారము తెగిన గాలిపటమువలె; వెలికిలఁబడ్డ తాఁబేటివలె, వేళ్ళు తెగిన వృక్షమువలె— తెలివి తప్పి, తేకువ చెడి, పాటవ మెడలి, ప్రాభవము సడలి; బిగువు తరిగి, బింకము తొలఁగి—కళ మాసిన మొగముతో కంపమైన తలకట్టుతో, గుంటలు పడిన కన్నులతో, కుంగిన చెక్కులతో; కమలిన పెదవులతో గారకట్టిన పలువరుసతో; వాడిన మేనితో, నసియాడిన యవయవములతో; ముడిగిన యూపిరితో, ము[illegible]న్నలైన యుదుపులతో — ప్రతిష్ఠ తప్పి పడియుండుటకంటె ప్రారబ్ధోపపత్తి యింకేమున్నది! ఇటువంటి సమయములలో మలయవతి యేమి చేసెసిదో! అట్టి మలయవతులు, ఇట్టి నిర్మలలు— లోకమున నెందఱున్నారో! తప్పత్రాగి తారుమారై; వికృత రూపముతో, వింత వాలకముతో, దుర్వ్యాసనతో, దర్భాషలతో, తూలుచు, తుళ్లుచు, వదరుచు, వాపోవుచు — నిండ్లకు వచ్చు భర్తలవల్ల నెంద ఱెందఱెంతెంత లేసి బాధలు పడుచున్నవారో! అన్నియు నెఱిఁగిన అగ్రజాతులవారి స్థితియె యిట్లున్నది గదా—అవ్యక్తులై, అజ్ఞానపు ముద్దలై, కూలి యాడినఁగాని కుండాడక, రేవుకుడిచిన మావు లేక, గంపెడు బలగముతో, గుంపెడు పిల్లలతో — దరిద్రదేవతకు దాయాదులుగా నొప్పు—

మాతృజాతులవారి నీమద్యపిశాచ మెంత మాక్సిమారణము సేయుచున్నదో గదా!

రఘు—(కదలి) కస్తూరీ! కస్తూరీ! గ్లాస్! గ్లాస్! (అని, అప్రియత్నముగా జేబనుండి మఱియొక సీసా తీయును)

నిర్మ—అమ్మయ్యో! అదొక సీసా! ఆ జేబు నిండ సీసాలేకావలయును! ఔరా చిత్రము! - ప్రబోధము లేకపోయినను, పరిచయవశమున బుద్ధిదానిమీదికే పోయినది రకము దానినే గ్రహించినది! ఆకర మలవాటుచొప్పున నదిగో దానిని నోటి కందించుచున్నది! అయ్యో నా తెలి తెల్లవాఱ!–ఆ సీసా యూడఁబెఱికి యావలఁ బాఱవేయక – తెరమీఁద బొమ్మనువలె తెల్లపోయి చూచుచు నిలుచుంటి నేమి! (అని చటాలునసీసాలాఁగికొని) ఛీ! ఛీ! యీ పాడుసీసాను జేతఁబట్టవలసి వచ్చినదే! (అని సీసా యెత్తిచూచి) ఏమీ – నీ పేరు ఎక్స్ట్రా విస్కీయా? ఎంతటిదానవు!

సీ. పలుసముద్రములు దీవులు దాఁటి యిటువది
నందల మెక్కిట్టె వచ్చినావు!
పరమ పవిత్రమై పరఁగు నార్యావర్త
పుణ్యభూమిని గాలు మోపినావు
క్రమముగా స్థిరపడి కడుశిష్టు లగు విను
ద్ధుల యిండ్లలోఁ గూడ దూరినావు!
అయినవారిం బట్టి యవలీల నీదు దా
సులకిందఁ జేసుకో గలిగినావు!
పెక్కు కొంపలకుం జిచ్చు పెట్టినావు!
మంచి సంసారముల రూపు మాపినావు!
సంఖ్యలకు మీఱు హత్యలు సలిపినావు!
మాయ విసమ! విదేశంపు మద్యరసమ!

(అని గవాక్షముగుండ సీసా పాఱవేయుచుండఁగా తెరపడును.)

ఇ ది ష ష్ఠాం క ము.




# సప్తమాంకము

## మొదటిరంగము

ప్రదేశము:- కస్తూరి పేటవీధి.

విశ్వాసరావు—(విచారముతో నడచుచు) సందేహ మేమి!

గీ. చెట్లు నసకుఁ జీడ, నీటికిఁ బెనఁటి నాచు
కాయలకుఁ బుచ్చు, బూజూరుగాయలకును
లలనలకు స్వేచ్ఛ, గృహమేధులకు ఋణంబుఁ
గొత్తులకుఁ భ్రష్టహానికిఁ గారణములు!

ఇంత యేల— ఋణ మన రాక్షసిగా నొక భూత మే!

గీ. తగని వెచ్చంబు మేను, జూదంబు నోరు
త్రాగుడును, వ్యభిచారము దంష్ట్రయుగము,
వడ్డి ప్రాణంబు, కోర్టున్యాపట్టు, తిండి
భూము, లిండ్లుఁ, దోటలు ఋణభూతమునకు!

అట్టి ఘోరఋణభూతముయొక్క కోరలనడుమ నొక్కసారి చిక్కువడినవాఁడు మరల దక్కుట దుర్లభము! బాబుగారె యిందులకుఁ బ్రమాణము! చినికిచినికి చివరకు గాలివాన యైనది. మొన్న వచ్చిన వారంటున కామె తల్లికడుపు చల్లగా ఆనిర్మలాంబ తన సర్వాభరణములను సమర్పించుటచేమఱ్ఱాగ దక్కినది! ఓహో నిర్మలాంబ నిజముగ నిర్మలాంబయే గదా! ఆసాధ్వి కాఁపురమునకు వచ్చి సంవత్సర మైనది. ఈసంవత్సరములో బాబుగారింటఁ బండుకొన్న దినము లేనే లేదు సరిగదా

తిండికి వచ్చిన దినములుకూడఁ దక్కవు! భర్తమీఁది బెంగ చేతనే యామె పాలిపోయి సగ మాయినది! ఈవారంటుమాటవిన్నచో నిఁక నేమేమి తరువాయి యుండునా! ఒకటి కాదు- రెండు కాదు- ముప్పదివేలు కక్కవలెను! అందుచేతనే యీసంగతి యామెచెవిని బడనీయక- బాబుగారిని రెండుదినములుబయటికి రావలదని చెప్పి- పైకముకొఱకుఁ బట్టణ మంతయు గాలింపఁ దలఁచుకొన్నాను. (పరిక్రమించి) ఇదిగో యిదియే కస్తూరిమేడ. పంకజముకొఱకు బావిలో దిగినట్లు- బాబుగారికొఱకు దీని యింటికి రావలసి వచ్చినది! (పైకిజూచి) ఆ పైచవికలోఁ బచారు చేయుచున్నది కస్తూరియె. అదిగో-ననుఁజూచి, ఆయనతోఁ జెప్పుటకుఁ గాఁబోలును వెళ్ళుచున్నది. (అటు నిటుఁ జూచి) వారంటు వాడింతఱకీ వంకకు వచ్చినట్లు లేదు? (ముందునకుఁ జూచి) ఆవచ్చువా రెవరో!- (నిదానించి) ఆఁహా! కస్తూరి రహస్యవిటుఁడని తెలియవచ్చిన కాసింసాహేబు. ఆవీధిలాంతరువఱకుఁ జని-అతఁడు దాఁటిపోయిన వెనుక మరల వచ్చెదను. (అని కొంచెము నడచి, వెనుకకుఁ దిరిగి చూచి) ఆకలిగొన్న కుక్కవలెనతఁడాయింటనే చొరఁబడుచున్నాఁడే! సరే-దీనివల్ల రెండు సంగతులు తేలినవి. మొదటిది: సాహెబుసంబధమిప్పటికిని సాగుచునే యున్నదని. రెండవది: ప్రస్తుతము బాబుగారింట లేరని. ఏమి చక్కని సమయము! బాబుగారి కిప్పుడు దీనినడత పట్టియిచ్చితినా- ఆయన భ్రమ తీర్చినవాఁడనగుదును. అయితే- బాబుగారి నిపుడెచ్చటఁ బట్టుకొనఁగలుగుదును? (ఆలోచించి) ఆఁ!-చీట్లాటకై శివరావుగారియింటికి వెళ్లి యుందురు. అతిశీఘ్రముగా నేనిపుడచ్చటి కేగితినా- అన్నిపనులు నెఱవేఱఁగలవు. (అని అతిత్వరితముగా నిష్క్రమించును.)

ఇది మొదటిరంగము.

---

# రెండవ రంగము

ప్రదేశము: —కస్తూరి పడకగది.

ప్రవేశము: కుర్చీలో గూర్చుండి కాసింసాహెబు_నిలుచుండి కస్తూరి.

కస్తూ—సరే కాని-వీథిలోనుండి నీవు లోపలికి వచ్చునప్పుడు విశ్వాస రావుగారు నిన్నుఁ జూచినారా?

కాసిం—ఇస్కా- మాకీ యిశ్వాస్ రావ్! ఆడ్కీ- మాదీ సూడండీ. ఆతూ మాకీ కైసా సూస్తాడూ వోయ్?

కస్తూ—ఏడిచినట్లే యున్నది కాని-ఇప్పు డెందులకువచ్చినావు?

కాసిం — ఆప్కా- రంగేళీ రగ్నాత్ రావ్ కు-వల్బాసెందూ వారంటూ సేపిచ్చిందీ మాటూ-సెప్పేదాన్కి-వచ్చాం. దాన్కి తంటాగావోయ్?

కస్తూ— ఏమీ?-రఘునాథరావుగారికి వల్లభచందు వారంటుచేయించి నాఁడా? అబద్ధము- అత-డట్లు తొందరపడువాఁడు కాఁడు.

కాసిం—అరే హైసూ ! ఆడ్కీ- సిపాయ్‌లాగా సీదా వొచ్చే దాన్కీ-సేసీ-మాకీ సాటూ. సెప్పిందాన్కీ-మనూస్లో మంటా పుట్టే-మార్వాడీకీ పుల్లాయేశాం. పుల్లాయేస్తే - ఆడ్కీ పూరా గాబరా లెగిసీ - వారంటూ లగాదియే!

కస్తూ—ఓరి దుర్మార్గుడా! యెంతపాపమున కొడిఁగట్టుకొంటివి?

కాసిం—అరే-ఆడ్మీదా-యెందుకూ వోయ్ యింతా మోజూ?

కస్తూ—ఇదిగో-వాఁడు వాఁడంటివా- చెంపలు వాయించెదను! ఎక్కువతక్కువలు లేకుండ వాగెదవు-ఏమూ పొగరు!

కాసిం—(చివాలున లేచి) అరే - తురకా బిడ్డా మీాదా-ధుక్కూ- బామ్మన్- యెఖ్వా సెప్పిందీ. యెపుడూ వోయ్? పంటీకి మొక్కు- తాడ్-బాపక్ వాడ్; పందీనేసూ స్తే-భంచో సెప్తాడ్- తురకా బిడ్డా!-అడ్డీయెఖ్వా? మాదీ యెఖ్వా? ఆవుకీ మొక్కు- తాడ్- అదవా బామ్మన్; ఆవుకే జబా సేస్తాడ్-అసల్ ముసల్మాన్! ఆడ్డే యెఖ్వా-మాదీ యెఖ్వా?

కస్తూ— కట్టు-కట్టు! కనుకనే యింతగతి పట్టినది!

కాసిం—అరే. హసూరాబాత్ సునో! ఈ సాటూ పేరం మాకీ సరి పడింది. లేదు-జమీందారు వాకీ-సలాం సెప్పి-మాకిందా ఖాయంచ్ ప్రంటావ్-నై తో-మాకీసలాం సెప్పి-ఆడ్కీ-ఆవుతావ్-ఏకీబాత్ బోలో!

కస్తూ—తాళు! తాళు! ఎవరో తలుపు తట్టుచున్నారు! (వినుట నభినయించి) అమ్మయ్యో! ఆయనయే! వారంటుమాట విని కావలయును-వచ్చి వేసినారు!

కాసిం—(కంగారుతో) అరే అల్లా! సచ్చాంరా బాబూ సచ్చాం! (వడకుచు) సానీవారూ మీకీ సలాంసేస్తాం- యెనక మాలే పెట్లో దాసీ పేసం తియ్యక - జైట్కీ- పంపండీ!

కస్తూ—అట్లయిన, నీవారిని పెరటిలోనికి బోయి, పెరటితలుపు తెఱచుకొని, పెడసంపునఁబడి చక్కఁబొమ్ము. ఊ! త్వరగా!

కాసిం—బతికాంరా బాబూ-! బతికాం! (అని వెళ్ళఁబోవును)

కస్తూ—జోడు! జోడు!

కాసిం—ఇస్కా- మాకీ- యిదీ వొచ్చింకే తంటా! (అని జోడు తొడగఁబోయి కంగారుచే తొడుగలేక, చేతఁగొని వెళ్ళును.)

తెరలో—(పెద్దచప్పుడు)

కస్తూ—చీర సవరించుకొని) ఏమి చెప్పమా - యెన్నఁడు లేనిది తలుపంత గట్టిగాఁ దట్టుచున్నారు! ఈరాక-వారంటుమాటను బట్టి వచ్చినరాకగాఁ లేదు! సందియ మేమి?- సాహెబుగారీప లికివచ్చుట చలపాది విశ్వాసరావు చూచియుండును. తనమాట నెగ్గించుకొనుటకిదే తగిన సమయమని పోయి యీయనతోఁ జెప్పియుండును. సరేకానిమ్ము- నాకు శక్తి సంగ్రహించుకొని వచ్చిన నోటుకోసేఁ డీతని త్రాడు తెంపకున్న- నాపేరుకస్తూరి కాను! (అని పెట్టె తెరిచి నోటుతీసి, సైకలో నిడుకొనిబిగ్గరగా) ఎవరువారు?-ఆ! వచ్చె-వచ్చె!- (అనిపోయి తలుపు తెరచును)

రఘు (చరచర లోపలఁ ప్రవేశించి, వెఱ్ఱిగా నలుదెసల వెదకును)

కస్తూ - ఏమిటి వెదకుచున్నారు?

రఘు—(ఆగ్రహముతో) ఏమి టని కాదు - ఎవరి నని యడుగుము!

కస్తూ—అట్లే కానిండు - ఎవరిని వెదకుచున్నారు?

రఘు - కాసింసాహేబును!

కస్తూ—ఏ కాసింసాహేబు?

రఘు ఏ కాసింసాహేబా?— నీ వలపుల కాసింసాహేబు!

శర్మ—(అంతలోఁ బ్రవేశించి) వారంటువాఁడు తుదకు వందరూపాయలతో వదలినాఁడు. అయితే మీరంతలో నేవచ్చి వేసినారేమి?

కస్తూ—జాగ్రత్తవో సాహేబు దాఁటిపోవు నని!

రఘు—అవును!— అట్లే! ఎక్కడ దాచితివో చెప్పుదువా— లేదా?

కస్తూ—చెప్పనా?— కొప్పులో!

రఘు—ఏమీ—నాతో సెకచక్కెములా! నాకడ నిట్టివేషములు పనికిరావు! కాసింసాహేబు నీయింటఁ గాలు పెట్టినాఁడా లేదా?

కస్తూ—అని మీతో నన్నవారెవరు?— విశ్వాసరావు గారేనా?

రఘు—అవును—ఆయనయే. అయిన నేమీ?

కస్తూ—ఏమియు లేదు— తా నొక తప్పు చేసినప్పుడు దానిం దప్పించుకొనుటకై యేగడ్డియునుఁ గఱవక యేమి చేయును! అయిన నాయన వెఱ్ఱియే కాని— యుసుకుసిళ్ళు కూడు కాలునా!

గీ. దిగిన ముంచును మున్నీరు తినినఁ జంపు
విసము; త్రొక్కినఁ గఱచును బెన భుజంగ;
మంటినం జిచ్చు మని కాలు నగ్ని— వాని
కెడముగా నుండువాగల కేమి భయము!

రఘు—ఏమిటి యుపన్యాసము?— నా కేమియు నర్థము కాలేదు.

కస్తూ—(బుడిబుడి దోసుపుతో) అవు నవును— చెప్పినమాటలతోఁ జెవులు దిబ్బలెక్కి పడినవానికి—ఎదుటివారిమాట లేమియర్థమగును.

చ. మానుగ, నగ్ని చేఁగొని ప్రమాణము సల్పఁగనిండు— గంగలో
స్నానము చేసి, యీశ్వరుని సన్నిధి బాస లొనర్పనిండు— మా

సానులమాట, యూరి కను సాలులమాటయు నమ్మువార లెం
దేనియు నుందు రే! నలువ యీగతిమమ్ము సృజించె నేమనన్,

రఘు—ఎందులకా యేడుపు?-సంగతి యేమో సరిగాఁ జెప్పరాదా?

కస్తూ—ఏమి లాభము! విశ్వాసరావుగారు వికవికలాడుచు నా యిం
టికి వచ్చుటయు- నన్నుఁ గోరుటయు- నాచేతఁ జీవాట్లు తిని,
యీ సంగతిమీతోఁ జెప్పవలదని బ్రతిమాలి-(రైకలోనినోటు
తీసి యెదుట వేయుచు) ఈనోటు నాపైఁ బొఱవైచి చక్కఁ
బోవుటయు- నా చెప్పినంతమాత్రమున నమ్మువారెవరు!

శర్మ—(చటాలున నోటు తీసి చూచి) వా టీజ్ దిస్ (What is this) సూదికొఱకు సోదె-కేగ-బ్రాతవి బయటబడెవన్నట్లైనదే

రఘు—అదేమిటి?

శర్మ—ఏమని చెప్పను! గ్రేట్ వండర్ అండ్ గ్రాండు డిస్కవరీ!
(Great wonder and grand discovery) చాలదినముల
నాఁటి మిస్టరీ (Mystery) యొకటి చక్కఁగా స్వాల్వు (Solve)
అయినది! నాఁడు పోయిన నోటు నెంబరెంత?

రఘు—అదా?-ఆఁ ముప్పదిమూడువేల నూటనువందల ముప్పదిమూడు

శర్మ—దీనిం జిత్తగింపుఁడు! (అని యానోటిచ్చును)

రఘు—(చూచి గుండె కొట్టినుచు) ఏమీ!-యెంత దుర్నయము!

చ. అలఘుమనస్కుఁ డంచు, సుగుణాఢ్యుఁ డటంచు; స్వామిభక్తి సం
కలితుఁ డటంచు నెంచితిని గాని, యితం డిటు- మేఁకవన్నె బె
బ్బులి యని; తేనెపాకమును బూసిన చాకని; పాలుపై పయిం
గల విషపుం గటాహ మని కట్టా! యెఱుంగఁగనైతి నెన్నఁడున్!

శర్మ—బాబు! పైస్థితినిబట్టి లోపలిస్థితిని నెఱుఁగుట కష్టమని నేను
నాఁడే మనవి చేసితినిగా?

రఘు—నిజమే- నీవు చెప్పినావు. కాని-

ఉ. పెంచిన కుక్కయే మడమ పీఁకు నటంచును- రక్ష సేయఁ గ
ల్పించిన కంచె చేనుఁ గబళించు నటంచును - నింతనైన్యఁ జె

గ్గించక చేతులార విష మిచ్చునటంచును- నెవ్వడేని యూహించునె యిట్టిఘోర మెప్పుడేని ప్రవర్తితెనే ధరాస్థలిని!

కస్తూ—ఇంతకాలమునుండి చూచుచు- ఈకస్తూరి నడత కనిపెట్టలేక పోయినవారు. అంతటి నాలిముచ్చునడత కనిపెట్టఁ గలరా!

రఘు—నిజమే నిజమే- నీపట్ల నే నన్యాయముగానే ప్రవర్తించినాను

కస్తూ—నాపట్ల మీరట్లు ప్రవర్తించినందులకు నా కేమియుఁ జింత లేదు. ఆ దుష్టుఁడు, నీయుద్యోగ లేకుండుటకై వల్లభచందు చేత వారంటు చేయించి మఱి వచ్చినందులకు కుళ్ళిపోవుచున్నాను!

రఘు—ఏమీ!-అదికూడ నాతనిపని యేనా! ఓరి విశ్వాసహీనుఁడా!

గీ. పుణ్యజనుఁ డన్న తెరఁగునఁ బుడమి, నేతి
బీరకా యన్న విధమునఁ బెరుఁతోఁట
కూర యన్నట్లుఁ- జక్కఁగాఁ గూర్పఁబడిన
దౌర, విశ్వాసరా వను పేరు నీకు!

కస్తూ—ఈ యుపాలంభనముల కేమి కాని- యిప్పు డాలోచింపవలసినవి రెండుసంగతులు.

రఘు—అట్లయిన- నా రెంటికిని ముందు పడవలసినవి రెండుగ్లాసులు!
(అని కుర్చీలోఁ గూలఁబడును)

కస్తూ—(గ్లాసులలో బ్రాంది తెచ్చి యిచ్చును.)

రఘు—(నోటఁ బోసికొని) ఇదుగో - యిప్పుడు మనసునకు మరల మహాతాబు వెలుగు వచ్చినది! ఆ సంగతు లిప్పుడు చెప్పు!

కస్తూ—మొదటిది- ఇంతవఱకు జరిగినప్పు డాయన నింకను నుద్యోగములో నుంచుటా- లేక, వెంటనే తొలగించుటా యనునది.

రఘు—నో! నో! No! No!) ఒక్కక్షణ ముండనీయను!

కస్తూ—అట్లయిన, నాయుద్యోగ మెవ్వరి కొసఁగెదరు?

రఘు—ఎవరో యేల?- మాశర్మ చాలఁడా ఏమోయి శర్మా!-

శర్మ—తమసెలవైనచో - థండర్ బోల్టువలెఁ బనిచేయఁ గలను.

రఘు—ఆల్ రైట్! ఇక్కడికీసంగతి సెటిల్! రెండవదేమిటి?

కస్తూ—వల్లభచారుు వారంటు సంగతి!—

రఘు—డామిట్! దాని కాలోచన మేమిటి! ఇప్పటి కీవారంటుపోయి నదిగదా - ఈసారి వారంటు వచ్చుసరికి ఎచ్చటనో బదులు తెప్పించి- యెడమచేతితో గిరగిర త్రిప్పి పాఱవేసెదను.

కస్తూ—నా కది నచ్చలేదు. సంస్థాన మిప్పటికే చాలవఱకు ఋణముల పాలయినది. మూలములకంటె వడ్డీలు మించివేయుచున్నవి. దావాలమీద దావాలు-వారంట్లమీద వారంట్లు! ఇట్టిస్థితిలో నింకను ఋణము చేయుట యేమి యాలోచనము?

రఘు—మఱేమి చేయుమనెదవు?

కస్తూ—అయిన మట్టునకు సంస్థాన మమ్మివేసి, అప్పులు తీఱఁగామిగిలిన ధన మింట నిడికొని, హాయిగా ననుభవించుట మంచిది.

రఘు—ఈసలహా నిన్నిదినములకే చెప్ప వద్దన్న వారెవరు? తే!- కలమును కాగితమును తే! విశ్వాసరావునకు డిస్మిస్ ఆర్డరు (Dismiss order) శర్మకు అప్పాయింటు మెంటు ఆర్డరు (Appointment ord*r*) సంస్థానము విక్రయించుటకు పవర్ ఆఫ్ అట్టర్ని (Power of Attorney) వ్రాసి సంతకములు చేసి యిచ్చెదను.

కస్తూ—వసారాగదిలోని మీ వ్రాతబల్లకడకు బోవుదము రండు.

రఘు—ఐయామ్ రెడీ! (I am ready) (అని దివాలునఁ లేచి)

*మైడియర్ లేడీ!- బ్రింగ్ దేర్ గుడ్ టాడీ
విత్ మటన్ పకోడి-టునారిష్ మై బాడీ. ..

తెర పడును.

ఇది సప్తమాంకము.

---

*My dear lady-Bring there good Toddy
with mutton Pakodi-To nourish my body.

